ప్రథమ ముద్రణము
౧౦౦౦ ప్రతులు

దుర్ముఖి : హేమంతము
౧౯౫౬ డిశంబరు

ఓం

# పద్య భారతి

రచయిత:

శ్రీ ముప్పాళ్ల వేంకటరత్నము

"భాషాకుటీరము"
అమరావతి (గుంటూరు జిల్లా)

# అంకితము

[illegible]

నా జనయిత్రి - లక్ష్మీ(శ్రీ) చరణ కమలములకు

పదియు నాల్కేడుల ప్రాయంబు నందె
బాలెంతవై నన్ను లాలించినావు;
ఏ విష ఘడియలో నేను పుట్టితినో?
రెండు శ్రావణములు నిండక మునునె
నాకు నీ స్తన్యంబు లేకుండ బోయె;
నీ పాద సేవకు నే నోచుకోను.

జనని! నీ పేరు భాషా ప్రపంచమున
శాశ్వతమ్మై యుండ 'విశ్వభారతిని'
నీ కంకిత మొనర్తు నెమ్మి గైకొనుమ్మ;
నన్ను దీవింపుము నా కన్నతల్లి!



తాను ఊరకుండక ఆ జనయిత్రి దుస్థితిని పొడగాంచుచు "నీ దురవస్థ చూడ మది నీరగుచున్నది; కన్నతల్లి! నీ వేదయుగాల గాథ వినిపింతువె? మామక చిత్త శాంతికై" అని యడిగినాడు. ఆమెయు "నా దురవస్థ గాథ ఒకనాటిదా? చెప్పిన తీరు నట్టిదా?" అనుచు "పల్లవి కన్నులు నేడు నీటికిం గుదురయి పోవ" వేదయుగము మొదలుకొని ఆంగ్లదాస్య విముక్తివఱకును క్రిందు మీదులతో నడచిన తన కథను ఘట్టములు ఘట్టములుగా అతనికి వినిపించి వెచ్చ నూర్చినది. కవి కుమారుడా కథయంతయు విన్నతరువాత–

"భరత జనయిత్రి! ఇదె సుప్రభాతమయ్యె;
పొరలు మంత్రంబుతో క్రుంగిపోను మనస్సు!"

అని యెన్నో రీతుల ననునయించి - ధైర్యము చెప్పి—

"నీ మహోజ్జ్వల భావి వర్ణింప లేను
విశ్వశాంతికి గురువుగ వెల్గగలవు;
సభ్య పాశ్చాత్య జగతి నీ చరణ యుగళి
కొలుచు దినములు ముందు రాగలవు తల్లి!"

అని యా విశ్వభారతికి జయ పెట్టినాడు.

ఈ కవితాగానమునం దెచ్చటి నైనను అపశ్రుతులు దొరలియుండ వచ్చును. సుకవి గాయకులు వానిని మన్నించి దయతో తెలియజేసిన నీ కవి కుమారుడు సరిచేసికోగలడు.

మహావాది

★

# ప్రస్తావనము

"... but they are also historical incidents, selected with careful discrimination, and reproduced in appreciative and effective language and in the deligently observed order of their proper chronology and topography; and in the things that are profitable for inspiration and example..."

—*George Birdwood*

ఆనుషంగికమూ అచ్చాఫీసు పనులతో గ్రంథాలయానికి పలు సంవత్సరాలుగా ఆలనాపాలన వహించింది, దాదాపు ఐదు సంవత్సరాలుగా అచ్చాఫీసు పనులతో ఎట్టి సంబంధం కాని లేక స్థానమూ, మానమూ కోలుపోయామనే భ్రాంతితో కుగ్రామంలో కాలం వెళ్లబోస్తున్న స్థితి. అట్టి స్థితిలో అచ్చుపడిన విడిఫారాల 'విశ్వభారతి' అనే పద్యకావ్యం నా చేతికి అందింది. ఆ విడిఫారాలు ఒక మూల మాత్రం సన్నని తెల్లదారంతో అనుబంధితాలై ఉన్నాయి.

అచ్చాఫీసునుండి అట్టి అపక్వ స్థితిలో ఒక గ్రంథాన్ని పొందే భాగ్యం గ్రంథకర్తకో, గ్రంథకర్త మిత్రుడికో మాత్రమే వీలుపడే విషయం. పుస్తకం రిజిష్టరు బుక్కుపోస్టులో అతర్కితంగా ఉపపన్నమైంది. గ్రంథకర్త నామాన్ని తెలిపే ఇన్నరుటైటిలు, అట్ట మొదలైనవి ఏమీ లేవుకూడా. నాటి టపాలో

దానికి సంబంధించిన ఉత్తరమూ రాలేదు. అబ్బుర పడ్డాను.

గ్రంథకర్త నామం తెలియనిపోయిన అబ్బుర పాటు అలా వుండగా అట్టి అమ్ముకాపీ అడ్వాన్సుగా కుగ్రామంలో ఉండిపోయిన నాకందగలిగినందుకు ఒక విధమైన ఉత్సాహం నాలో పుట్టుకు వచ్చింది. ఆ ఉత్సాహంలో గ్రంథావలోకనానికి పూనుకొన్నాను.

మొదటి పుటలో 'విశ్వభారతి' అని ముప్ఫయి ఆరు పాయింట్ల టైపులో గ్రంథ శీర్షిక. దానిక్రింద 'సందర్శనం' అని ఇరవైనాలుగు పాయింట్ల టైపులో చిన్న శీర్షిక ఉంచారు. అటు ఇటు పుటలు అలవోకగా తిరగవేశాను.

ఇరవైనాలుగు పాయింట్ల టైపులో మరికొన్ని శీర్షికలు కనిపించాయి. విడివిడి ఖండకావ్యాల శీర్షికలు అయిఉంటాయి అని మొదటి స్ఫురణ. అయితే 'విశ్వభారతి' ఏమిటి అనే విచికిత్స కలిగింది. వివిధ శీర్షికల్లో ముఖ్యమైన శీర్షిక తీసికొని గ్రంథానికంతటికీ అదే పేరు ఉంచే కొందరు ఆధునిక రచయితల సాంప్రదాయాన్నే ఈ గ్రంథకర్త అవలంబించాడేమో అని అనుకొన్నాను. 'విశ్వభారతి' అనే శీర్షిక ముప్ఫయి ఆరు పాయింట్ల టైపులో మొదట ఉండడమూ, ప్రతి ఎడమ పుట తలమీద 'విశ్వభారతి' నామం ఉండడమూ, గమనించి గ్రంథనామం ఇదే అనుకున్నాను.

పుస్తకంలోని పుటలు అన్నీ మళ్లీ - ఈసారి తాపీగా తిరగ వేశాను. ఇరవైనాలుగు పాయింట్లలో ఉన్న శీర్షిక లన్నీ లెక్కించాను. పన్నెండు లెక్కకు వచ్చాయి. కాని ఆ పన్నెండింటిలోనూ 'విశ్వభారతి' అనే శీర్షిక ఆమ్రేడితం కాలేదు. అందుతో ఇది ఖండకావ్య సంపుటి కాదేమో అని సందేహం కలిగింది.

ఇది ఇలా ఉండగా

ముప్ఫయి తొమ్మిదోపుటలో 'త్రిలింగశోభ' అనే శీర్షిక అచ్చుఅక్షరాలతో కాక చేతివ్రాత అక్షరాలతో ఉంది. అందుచేత అది ప్రత్యేకంగా, ముందుగా నన్ను ఆకర్షించింది. పైగా 'ఆంధ్రపిచ్చి' కలవాడిని కావడంచేత ముందు అది చదవడానికి పూనుకున్నాను. అందలి మొదటిపద్యం-

...............................ఉత్తరాపథో
న్మాదుసుగుప్త లిచ్ఛకొడుకుల్ కఱవైరి........................

.................................... ......................

........తెల్గుభూములను చోతి స్వతంత్ర సుఖాభిలాషతో.

మున్నుగా కలది చదవటంతోటే పుస్తక పథకం మనోఫలకంమీద స్థూలంగా చిత్రితమైంది. ఇవి విడిపూసలు కావనీ, ఒక కథాసూత్రంతో అనుబంధితాలై ఉన్నాయనీ, తేలింది.

మొదటికి వచ్చి గ్రంథపఠనం ప్రారంభించాను.

ఎత్తుగడపద్యము "అది సువిశాల సౌధము శతాబ్దుల నాటిది..." మున్నుగా కలది చదివాను. ఆపద్యం చదువుతూ వుండగానే ఏనుగు లక్ష్మణకవి వ్రాసిన

"అది మైత్రపురంబు, పూజ్యచరితుం డా రాజు...."

మున్నుగాగల పద్యం జ్ఞప్తికి వచ్చింది.

పూర్వకవుల రచనను తలపించేటట్లున్న 'విశ్వభారతి' రచనలోని 'సందర్శనము' శీర్షిక ఆబతో చదివాను. కవితామాధురి, చరిత్రాభిరతి కలగగా ఒకఊపులో కావ్యమంతా చదివాను. ఒకవిధమైన ఉత్తేజం కలిగింది. ఒకానొక ఆంగ్ల నాటకకర్త ఒకానొక పాత్రచేత పలికించిన

**"Give more incense**
**The gods grow deaf and drowsy."**

అన్నమాటలు సత్యసమ్మతాలని నాకు అప్పట్లో తోచింది – నాకు కలిగిన ఉత్తేజాన్నిపట్టి.

'విశ్వభారతి' లోని కొన్నిపద్యాలు హృదయాన్ని ఊపకలిగి ఉన్నాయి; కొన్ని పద్యాలు శిరఃకంపాన్ని కలిగింపజాలి ఉన్నాయి; కొన్నిపద్యాలు ఆమ్రేడితంగా చదవతగి ఉన్నాయి; కొన్నిపద్యాలు సప్రాణమైన దేశాభిమానాన్ని రేకెత్తించేవిగా ఉన్నాయి.

చక్రవర్తి సరికొత్త భారతాన్ని రచిస్తూ, ఆమెకు వినిపిస్తూ ఉంటాడు.

కవి, భరతమాత ముఖ్యపాత్రలు. ఆ పాత్రలు కాక ఇతడు మఱొకపాత్ర. కొసరుపాత్ర అగు ఈపండితుడు చూస్తూఉండగా కవి భరతమాతను పూజిస్తాడు. ఉత్తరకథలో ఈపండితునకు అంతగా ప్రసక్తి లేదు. ఆమీద కథఅంతా కవి, దేశమాతల నడుమ నడుస్తుంది.

ఇది 'సందర్శనము' అను ఇందలి మొదటి శీర్షిక ఇతివృత్తము.

అమ్మా! నీకథ వినాలని ఉందని కవి మాతతో అంటాడు. అప్పుడామె కవితో 'నీ వెవండవు? నీయెడ మంజుల నవ్యకవిత్వసత్కళాభ్యున్నతి' కనిపిస్తూ ఉంది, అని అంటుంది. అప్పుడు అతడు కవులను గురించి, ఈదేశములోని కవుల స్థితిని గురించి వివరించి చెప్పుతాడు.

ఈఘట్టములోని పద్యాలు అతిశయమనోజ్ఞాలై విడతీసి ప్రత్యేకం ఖండకావ్యంగా పరిగణింపదగిన పరువాన్ని సంతరించుకొని ఉన్నాయి.

తన కథ చెప్పే కవి ఆమీద ఆతల్లికథ చెప్పు మని అడుగుతాడు.

ఇందుతో ఈకావ్యమందలి రెండవశీర్షిక 'నివేదనము' ముగుస్తుంది.

అప్పటికి సూర్యాస్తమయ సమయమైంది. అప్పుడు ఆమె తన కథ కవికి వినిపించడానికి ప్రారంభిస్తుంది. సనాతన వైదిక సత్యధర్మ దీక్షాకమనీయ మూర్తులైన తన కొమరులను, కొమరార్తెలను—శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, దధీచి, హరిశ్చంద్రుడు, శిబి, కర్ణుడు, అరుంధతి, అనసూయ, సుమతి, సావిత్రి మున్నగువారిని—పేర్కొంటుంది.

అన్నిఖండాలవారు తన అందలమును నూచిన ఆ వేదయుగ గాధను ఆమె ముగించిన మాటలు వినండి :

నా సామ్రాజ్యము రామరాజ్య మనగా—నా వాక్కు వేదంబుగా
నా సాహిత్యము ముక్తిగీత మనగా—నాయిల్లు నాకంబుగా
నా సంతానము పద్మకల్పమనగా — నానావసుప్రాప్తితో
వాసిం గాంచితినోయి ! వేదయుగవిఖ్యాత శ్రీ మహారాజ్ఞినై.

ఇట్లు వేదయుగ చరిత్ర ముగించి కొంతతడవుండి ఆమె ఆమీాది బౌద్ధయుగచరిత్రను చెప్పడానికి ప్రారంభిస్తుంది.

ఇది నాలుగవశీర్షిక. నామం 'అహింసాజ్యోతి' అని.

మంచిరాత్రివేళ మాతచెప్పిన మహనీయగాధ అది. ప్రపంచమంతా అప్పుడు చీకటిరాత్రిలో. భారత దేశంలోమాత్రం చీకటులను విరియించు గొప్పజ్యోతి. అగుట ఇది 'వెన్నెలభూమి' అయినది.

ఘాతుకయాగమత్తులగు బుద్ధుడు గొప్పగ విశ్వశాంతి సం
గీతి వెలార్చె ; తన్మధురగీతి సుధాకణముల్ మనుంగుతై

పూత మహాస్రవంతులయి – పరిపక్వప్రయుక్త–కాల గా [illegible]

బుద్ధుని, చాణక్యుని, అశోకుని మొదలగు వారితో సంబంధించుకొనియున్న భారత దేశగాథ ఇందు ప్రస్తావ మందుతుంది.

వేదయుగ, బౌద్ధయుగ గాథల కథనం ముగిసే సరికి తెల్లవారుతుంది. అసందర్భాన నాలుగు గీత పద్యాలలో చక్కగ, సందర్భశుద్ధిగ సూర్యోదయ వర్ణన. ఆవర్ణనతో 'దాస్యశృంఖలు' అను ఐదవశీర్షిక ఆరంభ మవుతూవుంది. పృథ్వీరాజు, గోరి, అల్లాయుద్దీన్ మున్నగువారి ఉదంతాల అవలోకనం.

ఆఱవశీర్షిక ఆంధ్రప్రకరణం. 'త్రిలింగశోభ' అని నామం. పదకొండో శీర్షికను మినహాయిస్తే ఈ శీర్షికలోనే ఎక్కువ పద్యాలు – ముప్ఫయినాలుగు – ఉన్నాయి. ఈ విషయంపట్ల ఈ రచయితకుగల ప్రత్యేకాభిమానానికి ఇది ఒక గుర్తు. 'తురుష్క రాజ్యమందు దూడుపగత్తెనై బ్రతుకనోపక స్వతంత్ర సుఖాభిలాషతో, తెలుగుభూమికి వెళ్ళితి నని పరాంత ఈశీర్షిక గాథను ప్రారంభిస్తుంది.

కృష్ణవేణీ తీరస్థమైన అమరావతి రాజధానిగా దేశమేలిన శాతవాహనులు భారత జాతీయ వీరులై, శకకర్తలైన నాటి గాథలు జ్ఞప్తికి తెస్తూ ఓరుగల్లు, విజయనగర యుగముల ఆంధ్ర చరిత్రను, భారత

దేశపు ఇతిహాసమున దానికి గల ప్రశంసనీయ స్థానాన్ని, రూపిస్తూ ఇందలి ఇతివృత్తం నడుస్తూవుంది.

ఈ ఘట్టంలోని సంగతులు చెపుతూ భారత మాత మిక్కిలి తృప్తిని వెల్లడించినట్లు కవి చేసిన సూచనలు మెచ్చతగినవిగా, ఆంధ్రాభిమానులకు ఆమోదం కూర్చేవిగా, ఉన్నాయి. తిలకించండి.

> అప్రాంచక — భుప్రకాశతి [illegible]
> నాటిగాన సముద్ర తరంగ కథా [illegible]
> ధారాపాతములై [illegible] ఆంధ్ర మహారాజ్యము
> [illegible]

'త్రిలింగశోభ' అనువాటి శీర్షిక 'ప్రతాపదీప్తి' 'కత్తికి కత్తిగా నిలువగల్గిన యోధులు' పలువురు మొగలులకు లొంగిపోవగా 'ప్రాణము పోయినన్ శిరము వంచని' కొద్దిమంది రాజపుత్రయోధులు కొలువ 'శాత్రవుల శీర్షములం గొని బంతులాడిన' ప్రతాప సింగు ప్రతిష్ఠా జీవితాన్ని కథించుచుంటూ ఏడవ శీర్షిక ఎసలారుతూ వుంది. 'దాస్య శృంఖల'శీర్షికలో 'మానము కోసము నిప్పు పాన్పులన్ మేనులు వాల్చిన' అల్లాయుద్దీన్ కాలమునాటి మానవతీ మతల్లికలను ప్రశంసించిన భారతమాత ఈ శీర్షికలో 'మానము కోసమై ప్రసవమంజుల మోహనదేహయష్టి వైశ్వానరుపాలు చేసెడు ప్రశస్త చరిత్రలను' కొని యాడలేక పోయినది.

ఈ శీర్షిక 'తాజమహల్' వర్ణనతో ముగుస్తూ వుంది. తాజమహల్ 'వలపు వెన్నెల తిన్నె' గా గొప్పగా ఉత్ప్రేక్షింప బడినది.

దీని తరువాతిది ఐన ఎనిమిదవ శీర్షిక నామం 'శివప్రభ'. శివాజి కథ. అనుప్రసక్తిగ దుర్గదాసు కథ. ఆ వీరులను మాత కవిద్వారా మనకు పరిచయం చేసిన తీరు కనండి :

నవయుగమూర్తియై శివుడు నల్లనిగుఱ్ఱము నెక్కి — దేశవై
భవము సముద్ధరింపగ భవాని కృపాణము కేలదాల్చి — ఆ
యవనబలంబుపై నురికి నప్డు — భారతవీర శౌర్య సిం
ధువు పులకించి పొంగినది; ధూర్త తురుష్క వినాశకారియై.

ఆ సుముహూర్తమందె భరతాన్వయ శౌర్యమహార్ణవంబు వీ
చాని తరంగ సంక్షుభితమై కడు ఘూర్ణిల్లె: ఉత్తరాన స్వే
చ్ఛా సుఖజీవనద్యుతి వినాశతతి నింపగ దుర్గదాసు మ్లే
చ్ఛాసురకోటి నెంచి విజయధ్వజ మెత్తెనురా కృతాంతుడై

అప్పుడు 'గడియారమునం బదిరెండు కొట్టగా' కథాకథనం మాని మాత లోనికి వెళుతుంది. మధ్యాహ్నం అపరాహ్ణం కాగా మళ్లీ కథాకథనం ప్రారంభ మవుతుంది.

వేదయుగ గాథ చెప్పునప్పుడు – మాపటివేళ – భారతమాత పుష్పపరాగ పరీత వేదిపై ఉంటుంది. ఆమెకథ వినే కవి ఎదురుగ తిన్నెమీద ఆమె దాపున కూర్చుంటాడు. 'దాస్య రేఖలు' గాథ చెప్పేటప్పుడు– ప్రొద్దుటి పూట – భారతమాత కుటీరాంగణమందు

సుఖోపవిష్టయై ఉంటుంది. ఆమెగాథ వినేకవి ఆమెకు దాపలినైపున తుంగచాపమీద కూర్చుంటాడు. ఇక ఇప్పుడు అపరాహ్ణమందు – కథకురాలికి నవకుశాస్తర ణము : శ్రోతకు పచ్చికపట్టు.

మొదట వేదిక—ఆమీదట తుంగచాప—అటు పిమ్మట పచ్చికపట్టు. ఈ తీసికట్టులు, అవస్థాభేదాన్ని తెలిపే చక్కని సూచికలు.

తొమ్మిదవ శీర్షిక 'ఆంగ్ల దాస్యము.' ఆంగ్లే యుల 'దుస్తంత్ర దుర్నీతిక్రూర దురంత దుస్సహా ని యంతృత్వమ్ము'ను గురించి భరతమాత పిండితార్థంగా ఇట్లా చెప్పుతుంది:

కత్తి పట్టిన శక్తి; నోరెత్త శక్తి;
కలము సాగింప శక్తి; మాట్లాడక శక్తి;
సలుపు రొకటైన గూఢసంఘములకు శక్తి;
ఆంగ్లస్పృహల శక్తిస్మృతి కపటిలేదు."

ఆంగ్లదాస్యానికి అమృతఫలం 'భారత వీరలక్ష్మి.'

వీరము రూపుగొన్న యుగవేషములౌచు అమోఘఖడ్గయై
వీరతురంగ మెక్కి రణశోషము మీఱగ వైరివీర సం
హార మొనర్చుచున్ అనివిహార మొనర్చెడు ఝాన్సిలక్ష్మి యా
కారము గాంచినంతనె వికావిక లైనవి ఆంగ్లసైన్యముల్.

అయితే ఆ 'నైదేశిక దాస్యబంధముల'ను ఆ 'పదియును నెన్మిదేండ్లుగల బ్రాహ్మణబాలిక' తెంప లేక తాను తెగిపడింది. ఈ ఇతివృత్తంతో పదో శీర్షిక పర్యవసిత మవుతుంది.

అని పలుకుతాడు. పూర్వాంధ్రంవలె 'మహిత నిగమ కళాస్థాన మంటపము ఉపనిషత్పీఠమై' భారతమాత శిరసిగ కొలువుండాలని ఆ కవి చేయెత్తి చెప్తాడు.

సమ్యక్ప్రకృతికి నెలమొట్టయిన ప్రదేశంలో మూడు పగళ్లు రెండు రాత్రుళ్లు నడచిన కథాకథనం అంతటితో ముగుస్తుంది.

భారతదేశ చరిత్రలో 'కాలప్రవాహము కదలం జేసిన' వివిధ నృత్యాలను ఇట్లా ఒక కావ్యంగా చేర్పుతో కూర్చి శ్రీ వేంకటరత్నకవి మహోపాధి అయినాడు.

'విశ్వభారతి' లోని పద్యాలు సాఫీగా సాగిపోతున్నాయి. వానియెత్తుగడల్లో, ముగింపుల్లో తెలుపుగా నవ్యత తొణికిసలాడుతూన్నది. కాబట్టి ఇది ఒక 'రసోదయప్రబంధంగా' రూపొందింది. ఈ ప్రబంధంలో కవి 'ఆ హిమాచలసేతు పర్యంతధాత్రి' మొదలగు ప్రయోగాలకు శిష్టత్వ పాయము కలిగాడు. 'లుంటాకుడు', 'పాంథమ్మన్యుడు' మొదలగు పదాలు అర్థమహత్తా లద్యోతకట్లు ప్రయోగించాడు. 'గోడింబెట్టగ' — 'సూదులు దబ్బనంబులయి' — 'పటికికోటగా' — 'కటికి లు చింపిన విస్తరంటు' — 'బసుసు మొగగు' — 'పులిసిమూసిన్న మగవాడు' — 'ముష్టికి కొంగుబట్టాడు' మొదలైన జాతీయాలను ఆన్ధ్రప్రదేశ వినివేశితాలుచేసి నవ నిష్పక్ష్యము చేయగలిగాడు. 'మోజు' 'కంతిరి' మొదలైన అన్య భాషాపదాలు విరివిగా వాడి తన 'సమ్యక్ప్రకృతికి' ప్రభ కలిగించాడు.

కాంగ్రెస్, హిందూ మహాసభల రెండింటి సిద్ధాంతాలను గర్హితం చేసుకొన్న హృదయం గల ఆ కవి కాంగ్రెస్ వాదివలె ఖడ్గమును మంత్రమని కొండ కెత్తిస్తాడు; హిందూమహాసభ వాదివలె ఇస్లామును ఫకీరు మతమని ఈసడింప చేస్తాడు. తల్లికిగల 'శతాబ్దుల నాటి సువిశాల సౌధము' తోపాటు నేటి 'జోగుల కొంప' అగు తాటాకుల పాక పాఠకులకు కవి చూపిస్తాడు.

అందుచేత ఈ కావ్యం చదువుతూ వుండగా

తేనియవాకల మునిగి తేలినట్లయి - పూర్ణచంద్రికా
స్నాత మెరుపుల్మిట్టుల — వసంతవిలాసము గన్పించెగా
వేణు మురళిక గీతములు విన్న తెలుంగుల -- హాయిమీఱ నా
మానస మెంత పొంగెనో......................

ముక్త్యాల,
15—1—'57

ఇట్లు
ఆంధ్ర శేషగిరిరావు

# ముఖ్య సవరణలు

పుట ౫ : మొదటి పద్యము - నాల్గవ చరణములోని
'పాదప్రభువులు' అను దానిని 'పాదప్రభులు' అని-

పుట ౬౪: నాల్గవ పద్యము - మొదటి చరణములోని
'ఐరోపా వారి' అను దానిని 'అయిరోపా వారి' అని-

సవరించుకోవలెను.

ఓమ్

# విశ్వభారతి

## సందర్శనము

అది సువిశాలసౌధము శతాబ్దులనాటిది; ఉత్తమార్థసం
పదలను పంచిపెట్టినది మానవధాత్రికి; అన్యు లెందఱో
బ్రదుకగ వచ్చి యిచ్చటనె పాతుకపోయి పతాకమెత్తి అ
భ్యుదయ పరంపరం బ్రదుకుచుండిరి యం దొకమూల వేఱుగా.

తొల్లిటి ప్రాజ్యవైభవగతుల్ దలపించుచు కీర్తిపూగముల్
వెల్లువ గట్ట జాతిమతభేదము మాని సమానదృష్టితో
నెల్లర నొక్కరీతి జనయిత్రివిధంబున బ్రోచుచున్న యా
చల్లనియిల్లు చూతమని సాగితి నే నొకనాటి రేపటన్

చూపుల కా నికేతనము జోగులకొంపగ తోచుగాని ఆ
లోపలి కేగిచూడ సురలోకము కన్నుల గట్టు; మేటి పృ
థ్వీపతు లెందఱో యచట వీరము ధర్మము రాశివోయుచున్
గాపుర మున్నచిన్నెలు కనంబడు; తొల్లిటిశోభ యెట్టిదో ?

రాసిం బోసిన భోగభాగ్యములతో రత్నాల పుట్టిల్లుగా
వాసిం గాంచిన శాస్త్రపద్ధతులతో వైకుంఠధామంబుగా
ఆ సౌధంబును అంతసుందరముగా ఆకర్షణీయంబుగా
ఏ సంపత్ప్రభు లే కళానిలయు లిట్లేనాడు నిర్మించిరో

ఇచట కాపురమున్న యే సుధీనిలయులో
విపులార్థములు పంచిపెట్టినారు
ఇచట భద్రము గన్న యే రాజరాజులో
కొల్లగా రత్నాలు కొలిచినారు
ఇచట జీవించిన యే కళాచార్యులో
చిరకీర్తి శిల్పాలు చెక్కినారు
ఇచట జన్మించిన యే హాలస్వాములో
క్షామదేవత కాంక్ష గట్టినారు

దేశదేశాలనుండి యాత్రికులు వచ్చి
యుగయుగంబుల విఖ్యాతి పొగడినారు
ఖండఖండాలవార లిక్కడ వసించి
చదువుకొన్నారు సకల శాస్త్రాలు మున్ను.

# సందర్శనము

ఆ కమనీయ సౌధమున కావలివైపున - ఉత్తరాన-ప
ద్మాకర తీరమందలి విహార వనస్థలిప్రాంత - దేవతా
నోకహ మొప్పు నొక్కటి; మనోజ్ఞముగా నట గట్టినట్టి తా
టాకులపాక నొక్క ముదిమైదువ యున్నది లోకమాతగా.

ఆ ముసలాపె యెవ్వతియొ ? ఆమెకు నాకు గలట్టి బాంధవం
బేమొ ? తలంపలేను; వచియింపగలేను; లిఖింపలేను; నే
నా ముదిమూర్తిమోము కనులారగ జూచినకొద్ది భక్తియుం
బ్రేమయు భీతియుం దిగులు వెల్లగ గల్గె మనంబు లోపలఁ.

కరుణరసంబు ముమ్మరముగా గురియించెడు కన్నుదోయి - భా
స్వర మగు శాంతభావము ప్రసార మొనర్చెడు నెమ్మొగమ్మునఁ
ముదువులు గ్రుమ్మరించు ముదిముగ్గిన రూపము - నాకె కాదు - ఎ
ల్లరకును ఆ పురంధ్రి మెసలఁ గలిగించును మాతృభావముఁ.

కుదిరికయైన నెన్నుదుట కుంకుమ బొట్టునుబెట్టి - అంచుముల్
కదుకొను మూడు వన్నియల ఖద్దరుచీరె ధరించి - శీవిమై
ముదుసలిమాత మేలుకొలుపుంబలె రాట్నము ద్రిప్పుచుండె; అ
భ్యుదయ కవోష్ణరోచుల, యథోచితరీతుల సత్కరింపగఁ.

ఆ జనయిత్రిదాపల కుశాస్తరణంబున గూరుచున్న వి
భ్రాజిత పుణ్యమూర్తి - నవభారతపండిత చక్రవర్తి - రా
రాజులు లేని భారతము రమ్యపథాన రచించుచుండె; నా
నా జనపాళి గూడి నవనందన భూముల నాట్యమాడగన్.

ఆ సరిక్రొత్త భారతమునందలి కొన్ని వినూత్న ఘట్ట వి
న్యాసము లా జగజ్జనని కాతడు విప్పి పఠించి చెప్ప నే
నా సమయాన వింటి చెవులారగ; తత్కథ విన్నమీద ప్రా
ణోసవ మానినట్లు మన సంతయు మత్తిలె; నెందుచేతనో ?

పండితు డామె ప్రక్క నిలువంబడి భారతముం బఠింపగా
నిండు మనంబునందు జననీత్వము పొంగినదేమొ ? ఆమె "బ్ర
హ్మాండము నేలె దోయి తనయా ! " యని చేతులు చాపగానె బా
లుండయి పోయి తల్లియొడిలో పవళించె నతండు హాయిగా.

పున్నమవంటి యా మధురమోహనదృశ్యము గాంచినంతనే
మిన్నుల దాకె నా మనసు; మేను గగుర్పొడిచెన్; రసప్లుతిం
గన్నులు చెమ్మగిల్లినవి; కమ్మని బంగరు లేతయెండలో
పన్నగరాని భావముల నే నట నిల్చితి తన్మయుండనై.

# సందర్శనము

అది యావేశమొ ? పారవశ్యమొ ? రసాహ్లాదంబొ ? విభ్రాంతియో ?
మదికిఁ గూర్చు వినూత్న భారత కథామాధుర్య సమ్మోహమో ?
ఏదియుం దోచక ఆ రసోదయ మహా దృశ్యప్రబంధంబునే
మమపం జొచ్చితి పాదపప్రభువులు పుష్పశ్రీలు వర్షింపగఁ.

అవనీజప్రభు లెల్ల నాకు మధురాహ్లాదంబుతో గొప్పగా
విపులం గూర్చిన పుష్పసంపదలతో మిన్నంటి లోకైక గౌ
రవ భావంబు రహింపగా-అశికుమారస్వామినై పోయి-ఆ
భువనశ్రీ జనయిత్రి దివ్యచరణాంభోజంబులఁ వ్రాలితిఁ.

తేనియవాకలో మునిగి తేలినమాదిరి-పూర్ణచంద్రికా
స్నాన మొనర్చినట్టుల - వసంతవిలాసము గన్నరీతిగా
వేణుమరంద గీతములు విన్న తెఱంగున - హాయిమీఱ నా
మానస మెంతొ పొంగినది మాతృపదాబ్జములఁ స్పృశింపగఁ.

కమ్మని పారవశ్యమున కన్నులు రెండును అప్పగించి భా
గ్యమ్ములు చిందు మాతృవదనాబ్జమరందము ద్రావినాను : లో
కమ్ముల తల్లి నన్ను కనికారముతో స్పృశియించి వత్సల
త్వమ్మున ముంచి యెత్తెను స్మితద్యుతి మోమున మోసులెత్తగఁ.

కనుదోయి గురిసిన కమనీయజలముతో
తలిరాకు మృదు పదద్వయము గడిగి
లలితకళారామముల పూచు రసభావ
పుష్పగుచ్ఛములతో పూజచేసి
సర్వ సర్వంసహా శాంతికాముకమైన
ప్రేమార్ద్ర హృదయ నైవేద్య మొసగి
విశ్వమంతట క్రొత్తవెలుగుల నెగజిమ్ము
ఆ యహింసాజ్యోతి హారతిచ్చి

అంచిత శ్రుతి విశ్వ విపంచిమీద
తరగలై పొర్లు శాంతిగీతాలు పాడి
కలిగినంతలో లోపంబు గలుగకుండ
ప్రేమతో మాతృమూర్తి నర్చించినాను.

నా పూజం గని పండితాగ్రణి మహానందంబుతో నిండె; ప్రే
మోపాధ్యాయిని యైన యా జనని రాగోత్కంఠయై మేలుగా
నాపై దీవెనపూలు చల్లినది; ధన్యంబయ్యె నా జన్మ; ము
న్నే పున్నెమ్ములు రాశిపోసితినొ నా కీ భాగ్య మిట్లొప్పగన్.

# నివేదనము

పఠనం బేమియులేక ఏకముఖమై సార్వత్రికంబై మహో
జ్జ్వల రోచిః ప్రకరంబు గుప్పుచు అహింసాజ్యోతి ఆయింటికో
వెలుగొందం గని పొంగు లెత్తెడు రసావేశంబుతో లాలితో
క్తుల నే నా జనయిత్రితోడ నిటు లెంతో భక్తి భాషించితిన్.

జననీ! నీ వెవరో సనాతనివి; నీ చారిత్ర మెట్లొప్పెనో
వినగా కోరిక గల్గె; నీముఖములో వేదేతిహాసాలు-శా
స్త్రనిధుల్ - కావ్యములున్ - మహోపనిషదర్థంబుల్ - ప్రకాశింపఁ; పా
వన చారిత్రవు; నీకు సాటి యెవ రవ్వా! ఖండ ఖండాలలో?

కొడుకులు కూతులుం బ్రియము గూర్పరొ? ఆప్తులు గౌరవింపరో?
గడన గలట్టి రాచసిరి గాంచిన చిన్నెలు వన్నె లెన్నొ నీ
బడుగు మొగంబునందు కనుపట్టుచు నున్నవి; కన్నతల్లి! నీ
యడుగులు గొల్చువానిగ దయామతివై నను నాదరింపుమా!

కుడువగ కూడు-కట్టుటకు గుడ్డయు-లేని దరిద్రురాలివై
సుడివడి ఎంతకాలమని స్రుక్కుచు నుందువు నిండు పస్తులన్?
కొడుకుల తల్లివై ఇటుల గుందు నినుం దిలకించుకొద్ది నా
కడుపు మఱుంగుచున్నది; సుఖాలకు నీ విక నోచు టెన్నడో?

సిరులకు దూరమై బ్రతికి చెడ్డవిధంబున పూరిపాకలో
సురుగుచు నున్నదాన వని చూచినమాత్ర గ్రహించినాను; నే
పొరపడలేదుగా ? భువనముల్ పరిరక్షణ సేయజాలు నీ
గురుతర శక్తి సంపదలు క్రొత్తరుచుల్ వెలిజిమ్మ నెన్నడో ?

అసమాన మహిమతో నలరు నీ నెమ్మోము
పరమార్థమధువులు గురియుచుండె
జడిగొన్న కరుణతో తడియు నీ కనుదోయి
పున్నమ పువ్వులు పూచుచుండె
తలిరాకు నునుపుతో వెలయు నీ హస్తాలు
ఉదయరాగద్యుతు లొలుకుచుండె
రసభావ గరిమతో నెసగు నీ హృదయంబు
జలరాశి లోతులు చాటుచుండె

విశ్వ విఖ్యాతిగన్న పావిత్ర్యమెల్ల
కరుడుగట్టిన చందాన కానబడెదు;
పుణ్యజనయిత్రి ! నిను గాంచి పొంగు-మనసు;
ఎవ్వరవు నీవు ? నీ గాథ యేమి ? తల్లి !

# నివేదనము

ఏ దివ్యాకృతి చూచిచూచి జననీ! నిన్నొక్క సామాన్యగా
ఏ దుర్మార్గుడు చెప్పలే దకట! ము న్నేభాగ్యముల్ పండెనో ?
ఈ దారిద్ర్యము క్రొత్తదో ? సహజమో ? ఈ పాత కాణాచియో ?
ఏదో దుర్దశవల్ల నిట్లయితివో ? యేమో యెఱింగింపుమా ?

ఏనిటులాడ భావపథి నే తొంటిగాథలు పర్వులెత్తెనో
కాని విషాదరేఖలు మొగంబున దోపగ వెచ్చనూర్చుచుఁ
కానగరాని వేదన నెగాదిగ జూచుచు లోకమాత నా
మానసముఁ గదల్చినది మౌనము దైన్యము రాశివోయుచుఁ.

ఆ కరుణార్ద్రమూర్తి హృదయాంబుధి నెట్టి విషాదబాడబా
నీకము ప్రజ్వలించినదొ ? నెవ్వగ గూరినకన్ను లుష్ణధా
రా కలితంబు లైనవి; నిరంతర తాపముతో కృశించు సు
శ్లోకసవిత్రి నాహృదయ సుస్వరతంత్రులు మీటి యిట్లనెఁ.

నా దురదృష్టగాథ ఒకనాటిద ? చెప్పిన తీరునట్టిదా ?
వేదయుగంబునాటి యితివృత్తము; సర్వకళా ధనంబులఁ
గాదెల కెత్తితిఁ జగము కన్నులు విప్పనినాడె; నేటి కీ
పేదతనాన పేరునకు పెద్దగ నుంటిని శక్తిహీననై.

బ్రదుకును చావుగాక - సరివారలలో తలయెత్తలేక - ఈ
ముదిమిని దుఃఖపుంబరువు మోయుచు నుంటినిరా కుమార ! నా
బ్రదు కొక పెద్దభారతము; బాధలకే జనియించినాను; నా
యదుకులబొంత కాపురమునందు సుఖాలకు తావులేదురా !

కొడుకులు కూతు లుండియును కుక్కలు చింపిన విస్తరంటగా
చెడితిని కూడుగుడ్డలకు స్వేచ్ఛకు; మొన్నటిదాక దాసినై
ఇడుమల గుందినాను: ఇపుడిప్పుడె కూరిన కొద్దిస్వేచ్ఛతో
ఉడుకువ గాంచుచున్ బ్రదుకుచుంటిని గుక్కెడు గంజి ద్రావుచున్.

చిన్నికుమార ! నా స్థితికి చింతిలబోకుము; నిన్నుజూచి నా
కన్నులు చల్లబడ్డవి; నిగారపు మోము మెఱుంగులందు సం
పన్న కుటుంబగౌరవము - మంజుల నవ్య కవిత్వ సత్కళా
భ్యున్నతియున్ - ప్రసారమగుచున్నవి; చెప్పుము నీవెవండవో ?

కూడుం గుడ్డలు లేని దుర్దశలు నీకుం గూడెనో? పేదవో ?
పాడైపోయెనొ నీ యదృష్టములు ? నీపై 'మోజు' లేదయ్యెనో ?
చూడంజూడ దరిద్రజీవనముతో శుష్కించి యున్నావు; నా
నీడం జేరిన నిన్నుబోంటులకు నింతేరా మహాభాగ్యముల్.

ఆ నవనీతచిత్త యిటులాడుచునే భరియింపరాని శో
కాన మునింగిపోయినది; కంఠము గద్గద మయ్యె; చూపులం
దేనియ లూరు దివ్య జననీత్వము చిప్పిలె; నాదుచిత్తముఁ
గానగరాని వేదన వికావికలైనది వెచ్చనూర్పుచుఁ.

తన దురవస్థతోనె పరితప్త మనోంబుజమైన యా జగ
జ్జననికి నా నిమిత్తము విచారపరంపర మీఱినందుకై
మానలేదు కాకలం గుమిలిపోవుచు నే నపు డామె కూరటల్
దనుకగ మెల్లమెల్ల నిటులఁ వినిపించితి నా చరిత్రముఁ.

మాతా! నన్ను గుఱించి చింతిలకుమా మా వంశచారిత్ర్యముల్
తాతల్ నాటివి; మమ్ము బాయపు యుగాంతంబైన; మా వంశ వి
ఖ్యాతుల్ రాసులు రాసులై పెరిగి భూమ్యాకాశముల్ నిండె; మా
తాతల్ మాకు మిగిల్చిపోయినది నిత్యంబైన యీభాగ్యమే!

నా జాత్యున్నతి హద్దులేనిది; అనంతశ్రీలతో నొప్పు రా
రాజుల్ మాకు జోహారు చేసెదరు; మా ప్రజ్ఞా ప్రపంచంబులో
రోజాపూల మరందవాహినులు పారుం దల్లి! మాసృష్టిలో
రాజే బంటగు; బంటె రాజగును; మా రాజ్యంబు స్వారాజ్యమే.

ఆ రవి చూడజాలని రహస్యములం గనుగొందు నేను; శృం
గార మయ ప్రపంచమున కావ్యకళా వనభూములందు సం
చార మొనర్తు; మేలిమి వచస్సుల విశ్వము మెప్పు గాంతు; నా
నారస శోభితం బయిన నా హృదయంబు నెఱుంగ నేర్తురే ?

రసవాహినులు పొంగ రామాయణము పాడి
లోకాలు గొన్న వాల్మీకి మౌని
నిగమేతిహాసోపనిషదర్థజలధులు
త్రచ్చి చూచిన బాదరాయణుండు
హిమశైల శిఖరాల కెక్కిన కీర్తితో
కావ్యాలు వ్రాసిన కాళిదాసు
తత సంస్కృత జగత్తు తనయెంగి లనిచెప్ప
ప్రజ్ఞతో మెఱసిన బాణసుకవి

భాష్యవీథుల నిరుపమా ద్వైతసుధలు
గ్రుమ్మరించిన శంకర గురు వరుండు
పూజ్యచరితులు; మా మూలపురుషు; లమ్మ !
వారు పెట్టిన భిక్షయే బ్రతుకు మాకు.

నా కులగౌరవంబు సుజనస్తవనీయము; నాడు - నేడు - మా
ప్రాకట సాహితీ సుధలు త్రావనివా రొకరైన లేరు; వి
శ్వాకృతి దిద్ది తీర్చెడు మహామతిమంతుల మైనమాట - ఈ
లోకమునందె కాదు - సురలోకమునందును సాటిలేమిగా!

భారతంబు రచించి ప్రథమాంధ్ర సుకవిగా
నతులందుకున్న నన్నయ్యభట్టు
రారాజు కొలువులో రాయబారము తీరు
చక్కగా నడపిన తిక్కయజ్వ
కనకాభిషేకాన కవితా జగత్తుకు
నాథు డైనట్టి శ్రీనాథ సుకవి
మందార మకరంద మాధుర్యములు తెల్గు
పొలములో గురిసిన పోతరాజు

సాహితీ దిగ్గజంబులై సరస కావ్య
యశముతో నిలచిన పెద్దనాది కవులు
నా కుటుంబము పెద్దలు; లోకములకు
ఆట లాడించు మొనగాండ్ర మమ్మ! మేము.

వింతలు మాచరిత్రములు; విశ్వములోన యశోవిభూతి కొం
డంతలు మాకు గల్గినను - ఐహికభోగ సుఖానుభూతి గో
రంతలె తల్లి! నిర్ధనులరై బ్రదుకుం డని మా మొగాన ఆ
కంతిరి బ్రహ్మ వ్రాసెను ప్రగాఢపుటీసుల శాసనంబునన్.

మా పరివారు లేరని భ్రమంపడి నెమ్మది నున్నవుమ్ములన్
మోసము చేసె కాలము; విమోహితులైన విదేశసాహితీ
దాసులె నేడు పెద్దలు - ప్రధానులు; మాకథ మారెనమ్మ! ఏ
దోసములేని మాబ్రదుకు దుఃఖసముద్రము నీదుచుండెగా!

తెలుగు పొలంబు దున్ని - మడిదీర్చి - వనంబుల దమ్ముచేసి - పే
ర్లాలపుల నాఱుమొక్కల కళావిభవంబున నాటి - తీరుగా
కలుపును దీసి - పైరయిన కావ్యఫలంబులు రాశివోయు నా
పులముదొంగల్ దరిద్రులయి కుందుచునుండిరి నేడు పొట్టకై.

చినిగిన కీర్తితో బ్రమకు చేదయి పోయిన మాకు ద్వదటీ
వనములు మాసిపోయినవి; స్వప్నవిశేషము లయ్యె మా పురా
తన కథలెల్ల; మా సుకవితా సహకారము మోడువాఱి పో
యినది; చిపుళ్ళతో కులుకు చెప్పదొ, కోకిల పాడుచెప్పుడో ?

## నివేదనము

నీకుఁ మాకును మంచిరోజు లిక రానేరావ? మాకోసమై
శోకింపం దగవమ్మ! ఈ వయసులో కష్టోపవాసాలతో
చిక్కాకైతివి; వెండి నీవెపుడు హాసిం గాంచి రాణింతువో
మా కానాడె లభించు నిత్యసుఖసమ్మానాలు నీమేడలో.

మాకృషిపట్ల లోక మభిమానము చూపనినాడు దట్టపుం
జీకటివాకలో మునుగు; సృష్టికి వెల్గునొసంగు హక్కు మా
దే కద? మా రసోదయ కృతిప్రభ లా శరదభ్ర చంద్రికా
నీకములై అనంత సుఖనీరధులం బులకింపజేయవే?

బంగరు వానకై మొగము వాచిన వారము గాము; పొట్టకై
కొంగులు పట్టబోము; మము గొప్పగ జూచిన వారికీర్తికిఁ
రంగులు దిద్ది శీతకిరణద్యుతు లారగ క్షీరసాగరో
త్తుంగ తరంగమాలికల తోరణపంక్తు లలంకరింపమే?

పోయిన దా యుగంబు మధుపూర్ణిమ; మా కథలోని గౌరవా
ధ్యాయము పూర్తియైనది; వృథాశ్రమ; మాకు దరిద్రజీవనో
పాయములే శరణ్యములు; భావి యదృష్టము లెట్టులున్నవో?
నీ యనుకంప యున్న జననీ! సుఖియింతుము పచ్చపచ్చగా!

మా దురవస్థకై వగపు మానుము; పొట్టకు బట్ట కెట్లొ సం
పాదన చేసికోగలము; ప్రాయము వారము; వార్ధకంబులో
నీ దురవస్థ చూడ మది నీరగుచున్నది; కన్నతల్లి! నీ
పేదయుగాల గాధ వినిపింతువె? మాపుక చిత్తశాంతికై.

నా కథయెల్ల విన్న భువనంబుల తల్లి ప్రశాంత చిత్తయై
నా కుడిప్రక్క నిల్చి కరుణామయ దృక్కులతోడ నా మనో
వ్యాకులి మెల్ల దీఱగ శుభం బని దీవెనలిచ్చి నన్ను సు
శ్రీకర హస్త పద్మమున జేకొనె వాకొనరాని ప్రేమతో.

*        *        *

# వేదయుగము

అది రవి యస్తమించు సమయంబు-ప్రసూనవనంబు-సమ్మోద
ప్రద మగు మందమారుతము-భాసుర పుష్పపరిమళంబు-ష
ట్పదములపాట; ఈ ప్రకృతి వైభవముం గనుగొంచు తోటలో
ముదుసలిమాత యున్నదొక పుష్పపరాగ పరీతవేదిపై.

చలనము లేని చూపుల-ప్రశాంతమనంబున-సాంధ్యరాగ సం
కలితము లైన మబ్బుతునుకల్ దిలకించుచు, మౌనముద్రలం
దిఱకుచు నున్న యా జనని చెంతకు నే నపుడేగి ప్రక్కగా
నిలబడినాడ; కొంతవడి నిశ్చలవృత్తి ఘనీభవింపగన్.

పూచిన భక్తితో కరుణమూర్తికి పువ్వులు దోయిలించుచున్
గాచిన కూర్మితో మనసు కానుక లిచ్చి జొహారుసేయగా
వాచవులూర ప్రేమరసవాహినిలో జలకంబులార్చి నా
నోచినతల్లి అప్పుడు ననుం గరుణించె దయార్ద్రదృష్టితో.

ఎదురుగ తిన్నెమీద - జనయిత్రికి దాపున - కూరుచుండి నా
మది గల కోర్కె తేటపడు మాదిరి చూపులు చెప్పుకోగ - ఆ
సదమల శీల యెందులకొ చల్లని కన్నులు వేడినీటికిం
గుదురయి పోవ - తాపములు గుబ్బతిలన్ - నను జూచి యిట్లనెన్,

అన్నా! నాకథ చెప్పలేను; పరిపాకాకై పోయె కష్టాలు; నా
యౌన్నత్యంబులు చచ్చిపోయినవి; మృష్టాన్నాలతో మున్ను నే
నెన్నో జాతులవారి నున్నితిని; కానీ నేడు నా కన్నమే
సున్నైపోయెను; నాటి నా విభవముల్ చోద్యాతిచోద్యాలురా!

పలచిన మంచు శిల్పముల పుబ్బుల కొమ్మలు దీర్చి - శత్రురా
జులు వెఱగంద - శైలపతి చుక్కలకోటను గట్టెనాడు; స
ర్ధిలు జలవైభవంబున సరిత్పతి పెద్దయగడ్త్రద్రవ్వె; లో
తులు గనరాని రత్నరుచితో కెరటాల సురుంగు లారగన్.

తపగని ప్రజ్ఞతో వెలుగుదారులు దిద్దిన వేదభూమిలో
పొరలిన విశ్వపావన తపోవిభవంబులు మిన్నుముట్టగా
గురుతరకీర్తితో సిరులు గూరిన స్వర్గసుఖాన - ఎండక
న్నెఱుగక - ఈ సమస్తభువనేశ్వరినై నతులందుకొంటిరా!

నా కొడుకుల్ కొమార్తెలు సనాతనవైదిక సత్యధర్మ దీ
క్షా కమనీయమూర్తులు; జగన్నుతశీలురు; తచ్చరిత్రముల్
వాకున కందవోయి! జనపాళికి నిద్దపువెల్గుజాడలై
చీకటిసోకులేని సుఖజీవనమాధురి క్రుమ్మరించురా!

ఏ మహాపురుషుని నామాక్షరస్మృతి
విశ్వజనీనమై వినుతికెక్కె ?
ఏ కృపానిలయుని యేకపత్నీత్వంబు
పరమార్థనిధులెల్ల పంచిపెట్టె ?
ఏ గుణాంభోరాశి త్యాగశీలత దేశ
దేశాల కౌరవమ్ము దిద్దిపెట్టె ?
ఏ ప్రజాహితజీవి సుప్రభుత్వఖ్యాతి
పూర్ణిమాజ్యోత్స్నల పుక్కిలించె ?

ఏ విజయమూర్తి శరణాగతావనంబు
విశ్వమానవ కారుణ్య వృష్టిగురిసె ?
అట్టి రఘురామవిభుడు నాయనుగుపట్టి
వాని కాలంబు నాకు సువర్ణయుగము.

సీతారాములు నాకుటుంబమునకుఁ జేజేలు; ధర్మైక వీ
క్షా తాత్పర్యముతో సమస్తమానవ శ్లాఘ్యంబుగా మానవ
ఖ్యాతిఁ దిక్కుల నింపినారు; వినుమన్నా ! నా సుఖప్రాప్తి కా
సీత ప్రాభవమే శరణ్యము పునర్నిర్మాణ కార్యంబునన్.

ఎవని పిల్లనగ్రోవి యెండిన మోళ్ళకు
తలిరాకు విరుల శోభలను దార్చె ?
ఎవని మోహనమూర్తి యీ సృష్టికంతకు
సమ్మోహ పారవశ్యము ఘటించె ?
ఎవని పదద్వయి బృందావనోర్వికి
పావన వైకుంఠపద మొసంగె ?
ఎవని కురుక్షేత్ర శివగీతి జగతికి
మేలైన ముక్తిపాఠాలు గఱపె ?

స్వచ్ఛ యమునానదీ స్వర్ణసైకతమున
ఎవని బాల్యకథలు లిఖియింపబడియె ?
వాడు - శ్రీకృష్ణవిభుడు - నాపైడికాన్పు;
వాని యుగమున నాయిల్లు స్వర్గసీమ.

అందము చిందు మోహన ముఖాబ్జముతో - శరదిందు చంద్రికా
నందము కుప్పవోయు చిఱునవ్వులతో - మెయి పుల్కరింపగా
నందుని యింటిలో భరతనాట్యము సల్పిన ముద్దులయ్య న
న్నందల మెక్కజేసె; దివిజాధిపులే తల వంచి మ్రొక్కగన్.

ఘను లగు రామకృష్ణుల యుగంబున విశ్వము నేలు రాశిపై
కనక దుకూల వస్త్రములు గట్టితి; పెట్టితి భిక్ష దేవతా
గణములకెల్ల; నాగృహము కావలి గాచిరి ఆ త్రిమూర్తులే;
అనుపమమోయి! నా చరిత; మప్పటి గొప్పలు చెప్పలేనురా!

నవనిధుల్ పండిన నా జన్మభూమిలో
వీరస్రవంతులు వెల్లివిరిసె
నవసుధామయమైన నా ధర్మశాలలో
ముక్తి సంతానంబు మోసులెత్తె
నవరత్నమయమైన నా కళావిపణిలో
బహువిధ శాస్త్ర సంపదలు మెఱసె
నవనందనం బైన నా తపోవనములో
సౌశీల్య కుసుమాలు చాల పూచె

నిగమసారంబు లూరు నా నిలయమందు
లలితగతి అహింసాజ్యోతి వెలిగెనోయి!
అన్ని ఖండాలవారు నాయందలమును
మోచినారోయి! ఆ యుగంబున కుమార!

దనుజ భయంబుతో గతులు దప్పిన లోకము నేలుకంటె మిం
చిన సుకృతంబులేదని - శచీపతి కోరినమాత్ర - ప్రాణముల్
తృణముగ నెంచి వెన్నెముక దీసి యొసంగె దధీచి; వానితో
ఎనయగు త్యాగమూర్తులు మహిన్ జనియించిరె యే యుగంబునన్ ?

అనృతము రోసి - కౌశికుని యప్పును దీర్పగ కాంతనమ్మి - తా
నును కడజాతిసేవక జనుండుగ నమ్ముడువోయి - సత్యదీ
క్షను మెఱయించినట్టి త్రిజగన్నుతశీలుని - ఆ త్రిశంకుసం
భవుని - అనంతకీర్తి చరితంబులు దిక్కుల మాఱుమ్రోగవే ?

అనుపమ ధర్మదీక్ష శరణాగత రక్షణ పుణ్యమూర్తియై
మును శిబినేత 'కావు' మని ముంగల వ్రాలిన పావురాయి ర
క్షణ కయి నెత్తురొల్క మెయికండలు దేగకు కోసియిచ్చె; ఆ
తని సితకీర్తిహంసి భువిదాటి కకుప్పులు దాటిపోయెగా!

కట్టిన దానకంకణము కమ్మని శోభలు గ్రుమ్మరింపగా
పుట్టుకతోనె యున్న చెవిపోగులు - మైకవచమ్ము - స్వర్గస
మ్మాట్టుకు కోసియిచ్చె గుణమాన్యుడు కర్ణుడు దానవీరుడై;
కిట్టనివారలైనను లిఖింపరె వీనిచరిత్ర గొప్పగా ?

వీరలు నా యశోనిధులు; వీరలకేమిట దీసిపోని నా
కూరిమి సుతులుం గలరు కోట్లకుపైబడి; తచ్చరిత్రముల్
ధారుణి కంతకున్ వెలుగుదారులు; కీర్తిపాలాలు; వారి శీ
లారుణ నవ్యశోభ లుదయాస్తమయాద్రులు నిండిపోయెరా।

ఏ తపస్విని సప్తఋషిమండలంబున
మగనితో నక్షత్రమహిమగాంచె ?
ఏ పతివ్రత చిట్టిపాపలుగా మార్చి
ముమ్మూర్తులను ప్రేమ బుజ్జగించె ?
ఏ సుమంగలి హృదయేసుకోసము సూర్యు
నుదయాద్రి దరికి రాకుండజేసె ?
ఏ వధూమణి ధర్మదేవత మెప్పించి
నాథుని ప్రాణదానంబు గొనియె ?

ఆ యరుంధతి - అనసూయ - అమలచరిత
సుమతి - సావిత్రి - నా కూర్మిసుతలు పుత్ర!
వారి మహిమలు కనకాద్రిపై భవములు
నా యశస్సుకు వారే పునాదు లోయి !

ఇది నా వేదయుగంబు గాథ: అపుడీ పృథ్వీతలం బెల్ల నా
పదయుగ్మంబును మౌళిదాల్ప - సకలైశ్వర్యాలు నాయింటనో
కుదురై కాపురముండ - నిర్మల యశఃకోటీర చంద్రచ్ఛవి
చ్ఛవనచ్ఛాయల విశ్రమించితి; అహింసాప్రేమ సంధాత్రినై.

నా సామ్రాజ్యము రామరాజ్య మనగా నావాక్కు వేదంబుగా
నా సాహిత్యము ముక్తిగీత మనగా నాయిల్లు నాకంబుగా
నా సంతానము ధర్మకల్ప మనగా నానా రసస్ఫూర్తితో
వాసిం గాంచితినోయి! వేదయుగ విశ్వశ్రీ మహారాజ్ఞినై.

ఈ తుదిమాట నోట వచియించెనొ లేదొ? ఎలుంగు రాపడన్
చేతము పొక్కగా - వగపు చిందెడు కన్నులతోడ - ఆ జగ
న్మాత విచారభారమున మౌనము దాల్చె రవంతసేపు; నా
నా తరుపాళి పత్రచలనంబులు మాని మముం గనుంగొనన్.



# అహింసాజ్యోతి

ఆ మౌన ప్రకర ప్రబంధమున సంధ్యాగీతముం బోలె ని
ష్కామైకాగ్ర మనస్వి - బర్హిపతి - క్రేంకారంబు గావింప - ఆ
రామం బంతయు మాఱుమ్రోగినది; జాగ్రచ్చిత్తమై తల్లి నా
కామోదం గలగాధ చెప్పినది సూత్రాశ్వాస బంధంబులన్.

వాసిం గాంచిన నా పురాతనకథావైచిత్రితో తుల్యమై
రాసుల్ వోసిన నాజగద్వినుత ధర్మశ్రీలతో నవ్యమై
మా సిద్ధార్థుని హస్తదీపిక - అహింసాజ్యోతి - ఈనాటికిన్
నా సౌధంబున వెల్గుచున్నది అనంతప్రేమ చిహ్నంబుగా.

గౌతమ బుద్ధదేవుని యుగంబున - నాకథ - ఈ యనంత పృ
థ్వీతల మెల్ల నిండినది; తియ్యనికొమ్మలతోడ - ఆ యహిం
సా తరుమూర్తి ప్రోవిడిన చల్లని నీడలక్రింద - మానవ
వ్రాతము నేర్చుకొన్నది అపార కృపాగుణ కావ్యపాఠమున్.

ప్రేమ తపస్వి - శాక్యముని వీరుని భూతదయాస్రవంతిలో
ఆమని శోభలన్ జలకమాడినదోయి సమస్తభూమి; త
న్నామ జపంబు ప్రాచ్యభువనంబులవారికి శాంతి రక్ష; నే
డా మహనీయమూర్తికి జోహారులు సేయనివారు లేరురా !

కనువిచ్చి చూచెనా ? కడవలతో జీవ
కారుణ్య మధుర మేఘాలు గురియ
మనసిచ్చి పలికెనా ? మధు మోహన ప్రేమ
హిమవన్నదీ తరంగములు మొరయ
అడుగెత్తి నడచెనా ? ఆ యహింసా స్వచ్ఛ
పుష్పగుచ్ఛంబుల పొలుపు లెగయ
కలుషించి కినిసెనా ? గగనాలు భూములు
తలక్రిందులైన వృత్తములు మెఱయ

విశ్వకళ్యాణమూర్తులై వెలసినట్టి
నా కుమారులలో నవనాయకుండు
గౌతముడు: వాని చిరయశఃకావ్యజలధి
లోతుపాతులు గన్న వ్యాఖ్యాత లేడు.

జనముల బ్రోవ - శాక్యముని - సర్వసుఖాలు త్యజించి కానల౯
జనునెడ - తత్తురంగఖురశబ్దము విన్పడకుండ గొప్పగా
అనిమిష హస్తకోటులు హయంబు పదంబులు మోచెనంట ! ఆ
తని చిరకీర్తి జీవితకథా మహిమంబులు చెప్పశక్యమే ?

ఘృతదయాభిషిక్తు డగు బుద్ధుడు గొప్పగ విశ్వశాంతి సం
గీతి వెలార్చె; తన్మధురగీతి సుధాకణముల్ మడుంగులై -
పూత మహాస్రవంతు లయి - భూరిసముద్రములై - విశాల ధా
త్రీ తలమెల్ల ముంచినవి; తియ్యని ప్రేమ తరంగ మాలతో.

సన్నుతమైన యిట్టి సుఖసంపద లొప్ప స్వతంత్రురాలనై
ఉన్నతకీర్తితో బ్రతుకుచుండగ - కన్నులు గుట్టెనేమొ ? ఈ
వెన్నెల భూమిలో అడుగుపెట్టె సికందరు చక్రవర్తి; నా
తిన్నని జీవితంబున కిదే మొదలోయి పరాయిదాడికిన్.

విసమును గ్రక్కుచున్ యవనవీరులు సంగరశౌర్యలక్ష్మికిన్
ముసుగును దీసి - చీకొనిన పోటరులన్ గపటాన నొంచి - నా
పసిడి పొలాలు దోచిరి; అపారధనంబులు కొల్లగొట్టి సా
హసమున ప్రక్కలించిరి మహత్తర రమ్యయశఃకవాటమున్.

యవన పరాక్రమంబునకు - ఆహవతంత్రతకున్ - తలంకి గౌ
రవములు మాయ లోబడిరి రాజకుమారులు; నా స్వతంత్రవై
భవమును తగ్గిపోయినది; వైరికి దోయిలివట్టి యెట్టు లీ
షువి దలయెత్తనేర్తునని పొంగినకాకల పొక్కిపోతిరా !

మా పురుషోత్తమప్రభువు - మానిత పౌరుషమూర్తి - నా మన
స్తాపము దీర్ప శత్రువుల దాకి - అవక్రపరాక్రమ క్రమా
టోపముతో సికందరు పటుత్వము ముక్కలు చేసెగాని నా
పాపము పండినట్లు పగవారికి చాలక - ఓడిపోయెరా !

ఓడిననేమి? వాడు విజయుండుగనే సరిదూగె గాని - మా
టాడను లేదు దైన్యమున; ఔదల వాంచను లేదు భీరువై;
వాడి మగంటిమిన్ నెఱపి - భారతవీరయశోవిభూతి కా
పాడెను; మీస మున్న మగవా డనిపించుకొనెన్; ప్రసిద్ధిగా.

ఆ రణభూమి వెచ్చదన మారని నెత్తురుతోడ - ఆ మహా
శూరుని పౌరుషప్రభలు చూపును; జీలము వాహినీ పయః
పూరము వాని వీరయశమున్ నినదించును నేడుగూడ; నా
వీరచరిత్రలో అతని విశ్రుతగాథ సువర్ణమాలరా !

నాకై నాసుతు లెంత పోరినను ఛిన్నాభిన్నమైపోయె నా
యేకచ్ఛత్ర విభూతి; దుర్దినములోయీ! నాప్రజల్ దాస్యపుం
జీకట్లం బడి పేరుమాసిరి విదేశీయ ప్రభుత్వంబులో;
ఆ కష్టాలు తలంచుకొన్న మదిలో ఆరాటముల్ పొంగురా!

అసజయ మెట్టిదో యెఱుగనట్టి కుమారులు వంచనంబుమై
రిపులకు లొంగి - దాస్య మొనరించుట చూచి - విషాదతప్తనై
తెపతెప లాడిపోతిని; గతించెను చీకటియేండ్లు కొన్ని; నా
అపహృతకీర్తి క్రమ్మఱ దిగంతము లంటు దినాలు వచ్చెరా!

ప్రాచీఖండ సమగ్రశేముషికి పాత్రంబై - మహామంత్రియై -
ఆచార్యుం డయి - వైరివీరులకు సింహస్వప్నమై - ధీరతన్
మా చాణక్యుడు నా పరాజయ తమో మాలిన్యముం బాపి - ప్ర
జ్ఞాచాతుర్యముతో స్వతంత్ర సుషమా సౌభాగ్యముం గూర్చెరా!

ఆ కౌటిల్యుని బ్రహ్మతేజమును - మౌర్యక్ష్మాపతిక్షాత్రమున్ -
ఏకంబై - ఎదిరింపరాని వయి - నా యేకైక సామ్రాజ్య ల
క్ష్మీ కల్యాణ మొనర్చెనోయి! యవనశ్రీ నా యశోమంగళ
శ్లోకంబుం బఠియింపగా వెలిగితిన్ లోకైక విఖ్యాతనై.

ఆ సెల్యూకసు బుద్ధితెచ్చుకొని వియ్యంబందె నాతోడ; నా
వాసిం గూర్చి మెగస్తనీసు బహుధా వర్ణించె; నానా మహీ
వాసుల్ నాకు నమస్కరించిరి; జగత్ప్రఖ్యాతిగా నాజయ
శ్రీసామ్రాజ్యము వెల్గెరా! భరతలక్ష్మి భారతీకేంద్రమై.

మౌర్య చాణక్యయుగములో ప్రభాసగష్టి
కళలు వొడగిన నాకీర్తి కల్పతరువు
మా అశోకుని ధర్మసామ్రాజ్యమందు
పూచి ఫలియించె విశ్వసమ్మోహనముగ.

ఆ మహేంద్రుని విజయ సంగ్రామ కథలు
మాఱు మ్రోగెనురా విశ్వభారతమున;
భరత వీర యశోభూతి పండె ననగ
ప్రాచ్యభువనాలు వానికి ప్రాంజలించె.

ఆ కళింగయుద్ధప్రళయంబునందు
వఱద గట్టిన పచ్చినెత్తురులుగాంచి
జీవకారుణ్యభావంబు చెమ్మగిల్లి
బుద్ధదేవుని శిష్యుడై పోయె నతడు.

ఆ యహింసావ్రతంబు తా నాచరించి
శాంతిదూతగ నిలిచె విశ్వంబుమ్రోఁగ
అఖిల మానవప్రేమ కల్యాణగీతి
అతని రాజ్యరమాదేవి ఆలపించె.

బౌద్ధమత సూత్రభాష్యాలు వ్రాసి - అతడు
పంపి పెట్టెను పాశ్చాత్యప్రపంచమునకు;
ధర్మచక్రాలతో శిలా స్తంభపాళి
ధరణిపై నిల్పె శాంతి పతాకలట్లు.

అతని యుగమున భూతదయాసుధాబ్ధి
పొంగి పొర్లెనులా తూర్పుపొలములందు;
మూల మూలల శాంతి బీజాలు మొలిచి
బౌద్ధసస్యంబు సర్వత్ర పండెనోయి!

స్తూపచైత్యవిహారాలు - సుప్రసిద్ధ
విశ్వవిద్యాలయాలు - గంభీరభావ
శిల్పకేంద్రాలు - నాకశాసీమ మెఱసె,
యుగయుగంబుల నాకీర్తు లుబుకునట్లు.

కనుల పండువు మా అశోకుని యుగంబు;
విశ్వనాగరికత కది భిక్షపెట్టె;
సభ్యతం గన్న నేటి పాశ్చాత్యజగతి
అప్పటికి - ఇంక కన్నులే విప్పలేదు.

నేల నాలుగు చెఱగుల నిండెగాక
స్వప్నకథలోయి ! నాటి స్వవైభవములు;
నేడు సప్రాణశవముగా నిలచియుంటి;
పలుకలేనోయి ! గుండెలు పగులునోయి !

ఆ జగన్మాత - ఇంక - మాటాడలేదు;
పుక్కిలింతలై దుఃఖంబు పొంగి పొరల
వెచ్చనూర్పుచు - అటనుండి వెడలిపోయె;
అనుసరించితి నే నామె యడుగువోయి.



# హాస్యరేఖలు

కోడికూసెను జగతి మేల్కొలుపు గాగ
నవ్యచైతన్యశోభలు నాట్యమాడె;
ఉదయగిరిరాజు రక్తిమై ఎదురుపోవ
స్వాగతము పల్కె రవికి ఉషఃకుమారి.

పద్మినీదేవి చంద్రతాపమున గుంది
పతిని దర్శింప వేగిరపడుచునుండె;
కాని దినరాజు తూరుపుగట్టుపైకి
కదలి రాలేదు నవ్యప్రకాశ మొలుక.

ప్రకృతి యంతయు గగ్గోలు పడగ నప్పుడు
కాఱుచీకటి మబ్బులు గ్రమ్మె దెసల;
అమ్మహాదుర్దినము గాంచి అమ్మమనసు
తల్లడిల్లెను తరుణాబ్జదళము వోలె.

భువన కళ్యాణ కాంక్షతో శివుడు కన్ను
దెఱవగనె కాఱుచీకట్లు విరిసిపోయె;
జగతి నెల్లెడల స్వాతంత్ర్యశక్తి మెఱయ
పసిడి కిరణాలతో సుప్రభాతమయ్యె.

బంగరు చాయతో భువనబాంధవుఁడై నవజీవన ప్రభా
రంగమునన్ వెలుంగు దినరాజున కర్ఘ్యమొసంగి ఆ కుటీ
రాంగణమందు - ఒక్కయెడ - ఆ జనయిత్రి సుఖోపవిష్టయై
రంగున దాటుచున్న రురుశాబకముం గనుచుండె వేడ్కతో.

మురిపెము చిందగా మధురమోహనరాగ విలోకనమ్ములన్
హరిణము గాంచుచున్న జగదంబకు భక్తి నమస్కరించి ముం
దఱ నొకతుంగచాపపయి దాపలివైపున గూరుచుంటి; మా
యిరువురి చూపులం బెనచె నేవొ చిరంతనరాగబంధముల్.

కడచిన రేయి విన్నకథ కన్నులముందఱ దోచుచుండగా
విడువక విన్నదే మరల వింటిని; అర్థము గానిదెల్ల నే
నడిగి గ్రహించుకొంటి; ఇక - అవ్వలిగాథ వినంగగోరు నా
యెడద నెఱింగి ఆ జనని యిట్లు వచించెను వెచ్చనూర్పుచున్.

ఆ యుగవైభవంబు లడుగంటిన వోయి కుమార! నాయశో
ధ్యాయము పూర్తియైనది; మహానరకం బిక నాచరిత్ర; అ
న్యాయము మూర్తిగొన్నది; ధరాధిపు లెల్లపుడుం బరస్పరా
సూయలతో దెనంగుచు మసుంగులు వైచిరి క్షాత్రలక్ష్మికిన్.

ఎవరికి వారుగా ధరణియెల్లను ముక్కలుచేసి - క్షాత్త్రవై
భవమును గంగలో గలిపి - స్వార్థపరకుటుంబ కీర్తిగా
రవములు తూలి క్రిందువడ రాజులు మూరి తరాజులైరి; శా
త్రవులకు దారి యిచ్చిరి పరస్పరనాశపథానుయాయులై.

అది కనిపట్టి ఘుష్ఘుసు - మహమ్మదుఘోరి మహీయ దివ్యసం
పదలను కొల్లగొట్టుటకు వచ్చె కిరాతుడుగ్రవృత్తితో; అదే
మొదలు కుమార! నా అమరభూమి అనాద్యమునైన దుస్తరా
పదలకు పాలుపడ్డది; నృపాల సమైక్యము చచ్చిపోవగా.

అల్లా పేరున వాడు దుష్టహృదయుండై నెత్తుటన్ ద్రావుమం
ఢిల్లీరాజ్య సమగ్రసంపదలు లూటీసేయ దండెత్తగా
విల్లుం బల్లెము బట్టి యుద్ధమున పృథ్వీరాజు ఘోరిని మే
నెల్లం దూంట్లుగ గొట్టి పోవిడిచె నోయీ! అర్తసంత్రాణుడై.

ఆ యంటూరుడు పృథ్వీరాజుపయి శత్వాక్రోధమున్ గ్రక్కుచున్
జాలాసారుని కత్తిపూసియు జయించంజాల కన్లాడె స్వా
ణాలం గాచుకొనెన్ సహాయమునకు, ఐనన్ గోముఖవ్యాఘ్రమై
పీలుం జూచుచునుండె పట్టువలతో వేరంబు తోరంబుగా.

అల్లునిమీది కోపమున ఆ జయచంద్రుడు నా స్వతంత్ర సం
పల్లలిత ప్రభుత్వము విపత్తుల నొందగ గోరిపక్షమై
ఎల్లబలంబుతో వెడలె; ఇర్వురు దాకిరి ఒక్కమారె; ఆ
ఢిల్లిపురీశుడుం గసలి ఛీకొనె వైరుల వీరమూర్తియై.

గోరీపక్షము జేపట్టి జనకుం గోపించి సంయుక్త "ఈ
దారిం బోవుట మేలుగాదు; విమతుఁ దండించి దేశంబుకై
వీరుల్ ద్రొక్కినత్రోవ ద్రొక్కు;" మని చెప్పెం గాని దుర్మార్గు డా
శూరమ్మన్యుడు మ్లేచ్ఛదాస్యమునకే జోహారు లర్పించెరా!

వీరక్షాత్రము ఖడ్గమం దొలుక పృథ్వీరాజు నా స్వేచ్ఛకై
హోరాహోరిగ పోరి పట్టువడియెఁ యుద్ధాన; అవ్వీరునిఁ
గారంబెట్టి తపింపజేసి కనులఁ గాల్పించి చంపించె ఆ
గోరీరక్కసి; వానిబోలిన కృతఘ్నుం డీభువిం బుట్టునే?

జాతిక్షేమము గంగలో గలిపి - దేశద్రోహియై పోరి - జా
మాతఁ గూతును పొట్టబెట్టుకొని - ధర్మభ్రష్టుడైనట్టి దు
ర్నీతుం డా జయచంద్రు డంతమున గోరీఖడ్గదాహార్తికై
చేతు ల్మోడ్చి శిరం బొసంగె; నిజదుశ్చేష్టా ఫలంబోయనఁ.

ఆ నరహంత హస్తగత మైనది భారత భాగ్యలక్ష్మి; ఢి
ల్లీనగరాన క్రొత్తగ వెలింగిన దిందు పతాక; నాంది నా
కైనది దాస్యనాటికకు; ఆర్తరవంబులు మిన్నుముట్టగా
ఆ నరకాలు చెప్పవలెనన్న శరీరము జల్దరించురా.

అబలను గొంతుగోసిరి; కులాంగనలం జెఱవట్టి శీలముల్
చెఱచిరి; రక్తదాహమున చేతికి జిక్కినవారిలెల్ల ని
ష్ఠురముగ చీల్చిచంపిరి; వసుంధర చెప్పిన చేకపైచె; ఆ
కఱకు తురుష్కఘాతుకుల క్రౌర్యములన్ వచియింపలేనురా !

దురుసు తనంబుతో ధనము దోచిరి; కత్తినిజూపి యెందఱెం
దఱికొ మతం బొసంగిరి; సనాతన హైందవ పుణ్యదైవ మం
దిరముల నెల్ల కొల్లగొని నేలకు గూల్చిరి; శిల్పసంపదన్
జెఱచిరి; వారి చౌర్యములు చెప్పగరానివి ఈ యుగంబులో.

మానవతీ మతల్లికలు మానముకోసము నిప్పు పాన్పులన్
మేనులు వాల్చిరోయి; అపమృత్యువువాతకు జిక్కి యెందఱో
ప్రాణము లొడ్డిరోయి; మతరాజ్యము స్థాపనచేయగా మన
ల్మానులు మానులై వికటమార్గము ద్రొక్కిరి; ఖడ్గధారలన్.

పీనుగ పెంటతో - చితులు పేర్చిన బూడిదతో - అనుంగోళ
ధ్వానముతో - మహారుధిర పానముతో - మతతృష్ణతో - నిజని
ర్మాణము పిశాచరాజ్యరమ మామక పుణ్యగృహాంబునందు కా
లూనినదోయి! నాప్రియ కమోహనమై చెడెనోయి; నాయనా!

ఆయుర్వృద్ధిని గాంచెరా నిమతరాజ్య శ్రీ మహామూడి; అ
ల్లాయుద్దీను ప్రభుత్వమంచు ధరయెల్లన్ జాలక్షోభించెరా
న్యాయం బెన్నక వాడు దుష్టమతియై ఆ పద్మినీదేవికై
చేయుంజాచి ప్రచండసైన్యములతో చిత్తూరుపై దెత్తెరా!

రాణా భీముడు శౌర్యముం గురిసి ఆ రాకాసిసైన్యాలతో
ప్రాణాలొడ్డి రణం బొనర్చి తుది వీరస్వర్గముం జేరగా
ఆ నారీతిలకంబు భర్తృమృతికై అల్లాడి తీవ్రాగ్నిలో
లీనంబై వెలిబూదియై మిగిలె; ఢిల్లీపాదుషా తృష్ణయై.

భారతకీర్తివల్లికలు ప్రాకిన దిబ్బలతోడ జీర్ణమై
ఊరును పేరులేక పడియున్న పురాతనవీరధాత్రి - చి
త్తూరు గడంబు నేటికిని దుఃఖము చిమ్మెడు బూదితోడ ఆ
వీరసతీ చరిత్ర వినిపించుచు నున్నది గుండెవ్రీలగా !

పాడయిపోయె పూర్వయుగ భాగ్యము లన్నియు; ఉత్తరాదినో
వాడును గుర్జరీప్సు కొడుకుల్ కలిపైరి; తురుష్కరాజ్యమం
దాడుపుగత్తెనై త్రయికనోపక వీరము పండుచున్న యా
పోడిమి తెల్గుభూములకు బోతి స్వతంత్రసుఖాభిలాషతో.

అప్పటికే తెలుంగుసీమ యంతయు వీరుల పైరుపచ్చతో
నొప్పుడు మండెగట్టినది యోధులకీర్తి పైడిపంటలన్;
చెప్పగనేల? నాత్రితుకు చేడుగుపోయె; సుఖాలతీపితో
గొప్పలతో తెలుంగు కొడుకుల్ గొలువంగ స్వతంత్రనై తిరా!

తెనుగు పతాక ఆ మగధదేశము నాట్యమొనర్చ శౌర్యవ
ర్ధనులయి ఆంధ్రరాజ్య మమరావతి నిల్పిన వీరశాతవా
హనుల యశస్సుధా మధుపయస్సుల పొంగుచు కృష్ణవేణి నా
తెనుగు పొలంబులన్ ప్రమకు దిద్దుచు నున్నది పచ్చపచ్చగా!

లాలిత సర్వశాస్త్రకళలన్ వెదజల్లిన బౌద్ధవిశ్వవి
ద్యాలయశోభతో తతమహత్తర శిల్పకళావిభూతితో
నాలుగు దిక్కులన్ వెలుగునాయకు లద్దిన రమ్యకీర్తి చి
త్రాల తనర్చునట్టి అమరావతి ఆంధ్రుల స్వర్గసీమరా!

ఆ నగరాన ఉత్తరమునం దమరేశుని పుణ్యసౌధసో
పాన పరంపరం గడుగు; పావనమై అభిషేకతీర్థమై
శ్రీనిధి పొంగిపాఱు నవజీవన దివ్యవిభూతితోడ కృ
ష్ణానది; చూపుదాల్చిన ప్రశస్త మహాంధ్రయశస్తరంగమై.

కలుముల ప్రోలు ధాన్యకటకంబున తెన్గుల కీర్తిచిహ్నముల్
నిలిచినవోయి నేటికిని; నేలకు గూలిన రాచకోట ది
బ్బలు - శిథిలంబులై చెడిన బౌద్ధవిహార మనోజ్ఞశిల్ప సీ
మలు - వినిపించురా తెలుగుమాత జగన్నుతకీర్తిగాథలన్.

నవయుగ భారతంబు పలనాటి చరిత్రము విన్నవాడు - ధీ
రువులయినన్ జివాలున మెఱుంగు కటారులు చూసి - వీర శా
త్రవుల నెదిర్చి పోరెదరు; రక్తపుజందెము జూచి బాలు డా
హవ మొనరించినట్టి కథ లంచటినిన్ గదలించి పైచురా!

మొగమున బ్రహ్మతేజము - అమోఘ కృపాణమునందు క్షాత్రముల్ -
ధగధగ లాడుచుండ కనుదమ్ముల పౌరుషదీప్తి చిందగా
మగటిమితోడ శత్రువుల మార్కొని ఆంధ్రధరిత్రి వీరధా
త్రిగ మెఱయించినట్టి రణతిక్కన నా కొక వన్నె గూర్చెరా!

ఆ రుద్రాంబిక - భద్రకాకతి విశాలాంధ్ర క్షమామండలీ
నారీలోక సమగ్ర పౌరుషకథా నవ్య ప్రభాసారముల్
ధారాపాతములై భువిం దడుప ఆంధ్రశ్రీ మహారాజ్ఞియై
వీరచ్ఛత్రము బట్టెనాకు సకలోర్వీపాలనా దక్షతన్ .

కాకతి శౌర్యముల్ కరుడుగట్టినతేడు - ప్రతాపరుద్రు డా
యేకశిలా మహానగర మేలిననాడు త్రిలింగరాజ్య ల
క్ష్మీ కమనీయ వైభవము మేరువు సంపద పుక్కిలించుచున్
నాకపురీ యశోగరిమ నవ్వులపా లొనరించి మించెరా !

కులుకుల కుప్పగా హనుమకొండపురంబున శిల్పశోభతో
మలచిన వేయికంబముల మండపమందు త్రిలింగలక్ష్మి ని
స్తుల సముదగ్రపౌరుష యశోరుచితో గొలువున్ననాడు నా
అలఘుతర ప్రతాపమున కౌదల వాంచనివాడు లేడురా !

కాలము మారిపోయినది; కాకతి ఖడ్గము మొక్కవోయె; శౌ
ర్యాలకు ప్రోదియైన విపులాంధ్ర యశఃప్రభ లారిపోయె; మ్లే
చ్ఛాలయ మయ్యె ఏకశిల; ఆర్తరవంబులతో తురుష్క భూ
పాల కఠోర దైత్య పరిపాలన సాగెను దక్షిణాదిలో ,

కాలి బూడిదలయ్యె గ్రంథాలయాలు
కూలి ముక్కలై పోయె శిల్పాలయాలు
నేలమట్టంబు లయ్యె దేవాలయాలు
హోరు మని యేడ్చె నాయనా ! ఓరుగల్లు.

ఆ తురుష్కుల ధాటికి ఆగలేక
కాలరుద్రుని సెగకన్ను కమిలిపోయె
వీరభద్రుడు భయపడి వెన్నుచూపె
ప్రళయ చాముండి యెచటికో వలసపోయె.

పరమత ద్వేషహాలముతో ధరణి దున్ని
వఱద బాఱిన పచ్చినెత్తురుల దడిపి
భువన విలయంబుగా మ్లేచ్ఛభూమిపతులు
బూదిపంటలు రాసులు వోసిరోయి !

ఏమి చెప్పుదు నా దురదృష్టగాథ
గడియ గడియకు మారు రంగాలతోడ
స్థాయి చిక్కని వివిధ రసాలతోడ
ఒక మహాదృశ్యకావ్య మట్లొప్పెనోయి !

ఆరిపోయిన తెలుగు శౌర్యాగ్ని మరల
ప్రజ్వలించెను తుంగభద్రా తటాన
కఱుకు తగ్గిన తెలుగు ఖడ్గంబు మరల
వాడిగ్రక్కుచు తళతళ లాడెనోయి!

సాహసంబున కుందేలు జాగిలమును
తఱిమి కొట్టిన పౌరుషధాత్రిగాగ
మాన్యుడైన విద్యారణ్యమౌని కృపను
విజయనగర సామ్రాజ్యంబు వెలసెనోయి!

భయము గొల్పుచు దక్షిణ భారతమున
ముసురుకొన్న ముసల్మాను మూకలన్ని
వెఱుకుపడి మ్రొక్కె కుచ్చుటోపీలు జాఱ
విజయనగరాంధ్ర వీరాసి విజయరమకు.

ఇది సువర్ణాక్షరముల రచింపదగిన
వీరయుగమోయి! నా ఇతివృత్తమందు;
ప్రథిత కీర్తుల నేకాత పత్రమగుచు
తెలుగుప్రభ వెల్గెరా శతాబ్దుల కొలంది.

తెలుగు ధరిత్రికిం గళలు దిద్దిన తిమ్మరుసయ్య నాతపః
ఫలము కుమార! వాని ప్రతిభా సమయోచిత ఖడ్గ శ
క్తులకు తలంకనట్టి నృపకుంజరు డొక్కఁడుగూడ లేడు; ని
ర్మల మహదాంధ్రకీర్తి మహిమంబున కాతడు భిక్షపెట్టెరా!

ఆ చాణక్యుడు లోకసన్నుతమనీ షామోఘ తేజస్వియై
ప్రాచీనోత్తర భారతంబు వెలయింపఁగా యావదాంధ్రక్షమా
సాచివ్యమ్ము రహింప తిమ్మరుసు ప్రజ్ఞఁగా దక్షిణక్షోణిలో
నా చారిత్రము దిద్ది తీర్చెను అఖండ ప్రాభవోపేతుడై.

ఘనుడగు కృష్ణరాయ మహికాంతుని వీరవిభూతి - తిమ్మనా
ర్యుని సచివత్వముం గలిసి ఉన్నతిచూపిన నాడు - నా యశో
వనములు పూచెనోయి! రసవాహిని పొంగగ తుంగభద్ర నా
ఘనతర శౌర్యగీతముల గాన మొనర్చినదోయి! గొప్పగా.

పోయిన స్వేచ్ఛ నా కమరె; పొంగెను కీర్తిసుధాప్రవంతి; మా
రాయల సీమలో యవనరాజులు గాజుల కేలుదోయితో
దోయిలివట్టి నా యడుగుదోయి భజించిరి; వీరమాతనై
ఆ యుగమందు మేల్పసిడి యందల మెక్కి చరించినానురా!

### త్రిలింగశోభ

ప్రాచీ పశ్చిమ దక్షిణాంబునిధి పర్యంత క్షమా ప్రాభవ
శ్రీ చెన్నారగ హంపిపట్టణములో సింహాసనాసీనపై
వాచాతీత యశోవిలాసములతో వర్ధిల్ల నా వైభవ
ప్రాచుర్యమ్ము విదేశవాసులు సువర్ణశ్రీలతో వ్రాయరే?

తెలుగు శిల్పము సొంపు దిద్దుకొన్నది స్వర్ణ
ఖచిత దేవాలయాంగణములందు
తెలుగు భారతి నవ్యకళ లందుకొన్నది
సలలిత సాహితీ సభలయందు
తెలుగు సంపద పాతఱలు నింపుకొన్నది
సకలార్థ పూర్ణ నిషద్యలందు
తెలుగు శౌర్యము మెఱుంగులు పెట్టుకొన్నది
శక్తిపూజా ప్రదర్శనములందు

హంపినగరాన విశ్వవిఖ్యాతమగుచు
వెలిగినది సాటిలేకుండ తెలుగుకీర్తి;
రాణ మీఱిన రాయల రాజధాని
మఱువరానిదిరా విశ్వమానవులకు

హంపిపట్టణ శిల్ప కల్యాణశోభ
నిండెనోయి ! విశాల భూమండలమునః
అలవి దప్పిన చట్టులో మలచినట్టి
నంది చిత్రము విస్మయానందకరము .

ఏక శిలలోన మలచిన భీకరోగ్ర
వీరనరసింహ విభుని గంభీరమూర్తి
మధురమోహన నవకళా మందిరమున
ఒక మహాశిల్పకావ్యమై యొప్పెనోయి !

పొలుగారెడు చలువ కంచాలతోడ
ప్రకృతి సౌందర్య మొలుకు చిత్రాలతోడ
రాయల హజారమున నొప్పు రామచంద్ర
మూర్తి ఆలయశోభ అపూర్వమోయి !

ఆ మహత్తర విఠలాలయంబునందు
శిల్ప సౌందర్యమధువులు చిందెనోయి !
గతులు దప్పక స్వరసప్తకంబు పలుకు
ఆ శిలాస్తంభ సృష్టి యేమనగవచ్చు ?

# త్రిలింగశోభ

విజయనగర విశాలాంధ్ర వీధులందు
పసిడి కుప్పలు తిప్పలై పరగునాడు
ఖండఖండాల తెల్లమొగాలవారు
బ్రదుకుగాంచిరి నా గృహ ద్వారమందు .

రంగదుత్తుంగ తుంగభద్రా స్రవంతి
నవ్యజీవన వీచీ నినాదములను
దిక్కు దిక్కుల వినిచె నా తెలుగు గరిమ
గాలితరగలు గీతాలుగా పఠింప .

నవ నవోదయ శోభతో నాల్గుదెసల
కమ్మని తెలుంగు వెలుగులు గ్రమ్మినపుడు
చీకటి ముసుంగు దీసి పశ్చిమ ధరిత్రి
మేలుకొన్నది భావి సుఖాలతోడ

పొలుపు లెగసిన మధుశిల్ప ధామములందు
కలిమి పండిన కీరితి కొలువులందు
విభవ మొలికిన వెన్నెల వీధులందు
ఆడుకొన్నది హాయిగా హంపిలక్ష్మి .

# ప్రతాపదీప్తి

విలసిత కీర్తి వైభవము విశ్వమునిండగ తెల్గునాట నే
నలరుచునుండ - ఉత్తరమునందు తురుష్కుల రాజ్యలక్ష్మి వి
చ్చలవిడి సాగి వింధ్యగిరి సానువులందు విహరింప జొచ్చె; మొ
గలుల కడింది సైనికుల ఖడ్గపరంపర కాపువెట్టగన్ .

ఆ మొగలాయి వంశమణి - అక్బరు నిష్ఠుర హైందవ ప్రజా
స్తోమము నెల్ల నాలుక రుచుల్ పచరించుచు చిచ్చికొట్టి - ఇ
స్లాము మతప్రభుత్వమును స్థాపనచేసెను; భారతంబులో
నా మహనీయ శౌర్యమును నాశ మొనర్చెను నీటికోతగా .

నా రసపుత్రయోధులు సనాతన భారత వీరధర్మ వి
స్తార సమగ్ర పౌరుషకథా విభవంబులు మాసిపోవ జో
హారు లొనర్చినారు యవనాసికి; కొందఱు దాస్యమగ్నులై
కూరిమి కూతులన్ దురక కోటలికానికి పంపినారురా !

కత్తికి కత్తిగా నిలువగల్గిన యోధులు లొంగిపోవ - అ
జిత్తులమారి అక్బరు విశృంఖలవృత్తిని చక్రవర్తియై
మెత్తని చూపుతో దురుసు మీసము ద్రిప్పుచు నా స్వతంత్ర సం
పత్తి హరించె మొగలుల భాగ్యపరంపర మోసులెత్తగన్ .

ఆఱడి కగ్గమై యవన హైందవ సఖ్యము పేరుమీద నా
వీర కవోష్ణరక్త మపవిత్రతకుం గురియయ్యె; మ్లేచ్ఛ స
ర్దారులుగా మెలంగిరి ధరాపతులెల్లరు; నా దురంత దు
ర్వార పరాక్రమాయుధము వాడిమెఱుంగులు తగ్గిపోయెరా!

ప్రాణము పోయినన్ శిరము వంచని నా రసపుత్రయోధ సం
తానము మ్లేచ్ఛ భూపతి పదాలకు మ్రొక్కిననాడు - నాయశో
హీన నికృష్ట దాస్యమున కెంతగ నేడ్చితినో వచింపగా
లేను కుమార! నాబ్రదుకు లేవిడిపైనది సాటివారిలో.

మానముకోసమై ప్రసవమంజుల మోహన దేహయష్టి వై
శ్వానరు పాలుచేసెడు ప్రశస్త చరిత్రలు - నా కొమార్తె లా
హీన తురుష్క హస్తము గ్రహించిన గాథలు విన్ననాడు నా
మానస మెంత పొక్కినదొ మాటలు చాలవురా వచింపగా!

అతులితమైన స్వేచ్ఛ అడుగంటెను; నా మహనీయ విక్రమో
న్నతి తలక్రిందులయ్యెను; అనంతయశః పరిపూర్ణమైన నా
బ్రతుకు మహో పరాభవ విపత్తులకుం గురియయ్యె; ఆ యధః
పతనము చెప్పలేను; ఒక బానిసనై తపియించిపోతిరా!

కుదిరికలేని నా హృదయగోళము వ్రయ్యగ నీచదాస్యపుం
బ్రదుకునకోర్చి కష్టముల గ్రుగ్గుచు నే దురపిల్లుచుండ - ఆ
యుదయపురీ ప్రతాప విభవోజ్జ్వల వీధుల నా స్వతంత్ర సం
పదలు రహించెనోయి ! రిపు మండలి గుండెలు తల్లడిల్లగా .

వీరక్షాత్రకుల ప్రసూతి - భరతోర్వీభాగ్య నిర్మాత - దు
ర్వారోదగ్ర బలప్రతాపఖని - మా రాణాప్రతాపుండు నా
పేరుగా నిల్పె; స్వతంత్రజీవన మహోఖిల ప్రభాపోదయ
శ్రీ రాజిల్లగ మ్లేచ్ఛశాసనతమో జీమూతవాతూలుడై .

ఆ రసపుత్రయోధుని మహత్తర పౌరుష ఖడ్గధాటికిం
భేదము వాఱుచుగా యవనవీరులు ప్రాణలు చచ్చిపోయి జో
హారు లొనర్చినారు; దురహంకృతితో నెదురొడ్డి నెత్తురుల్
వారులు వోసినారు; దళనాయితనంబులు తూలిపోవగా .

భరతోర్విగా యవనాధిపత్యము సహింపంబోని ఆ హైందవే
శ్వరు నెట్లైన జయింప - అక్బరు - మహాసైన్యంబుతో నెత్తగా
సరి రాజన్యులు వేచ్ఛదాస్యపదవీ సమ్మోహిత స్వాంతులై
పరపక్షంబు వహించి పోరిరి ప్రజాస్వాతంత్ర్యభంగంబుగా.

ఒక్కడె యయ్యు తాను పుయిలోడక - వైరి నెదుర్చు సైన్యముల్
చక్కవయయ్యు చిక్కక - ప్రతాపనృపాలుడు పౌరుషాగ్నులం
గ్రక్కుచు - మాతృదేశ పరిరక్షణకై శివమెత్తినట్లు పెం
జిక్కుల ముంచి శాత్రవుల శీర్షములంగొని బంతులాడెరా!

రణఘీముం దగు భీమచాందును - సలుంబ్రా కృష్ణసింహుండు - నా
యసగుం బుత్రులు క్షత్రయోధులును - తోడై పోరినన్ నేల యీ
నిన చందంబున గ్రమ్ము మ్లేచ్ఛబలముల్ నిర్జింపగాలేక ప
ట్టణముం దాసి చనెన్ ప్రతాపుడు; ప్రతిష్ఠా జీవియై కానకున్.

ఆలుం బిడ్డలతోడ కాఱడవిపాలై కూడ ఆ మ్లేచ్ఛ భూ
పాల ప్రాభవముల్ సహింపక - ప్రతాపక్ష్మాధవుం డెన్ని క
ష్టాలైనన్ భరియించి - భారతధరా స్వాతంత్ర్య సంధాతగా
కాలంబుల్ గడపెన్ దురుష్కపతనాకాంక్షా సముల్లాసియై.

కూటికి లేకపోయినను కొండల మందక - ఢిల్లిపాదుషా
ఘాటికి లొంగ కవ్విమతదాస్యకఠోర మహాపిశాచి కు
చ్చాటన మంత్రముం జదివె శౌర్యధనుం డత డుగ్రమూర్తియై
నేటికిగూడ వాడు స్మరణీయుడు మామక పుత్రకోటికిన్.

ఆ ప్రతాపుని యస్తమయంబుతోడ
అస్మదీయ సుఖస్వేచ్ఛ లస్తమించె;
భరతధాత్రీ విశాలాభ్ర పథమునందు
యవన దాస్యతమఃపుంజ మలముకొనియె.

పౌరుషము చచ్చి భారత ప్రభువులెల్ల
అక్బరు ప్రభుత్వమునకు దాసోఽహ మనిరి;
హైందవము రాశిపోసిన హస్తిపురము
యవన సామ్రాజ్యరమకు జోహారుచేసె.

మహిత నిగమ కళాస్థాన మంటపమున
ఉపనిషత్ప్రిశిపై కొలువున్న నాకు
విమతరాజన్య దాస్యప్రవృత్తితోడ
బ్రదుకవలసిన దుర్గతి పట్టెనోయి!

ఏ ముహూర్తాన గోరి యీ భూమిమీద
అడుగు పెట్టెనో ఆ పాడు గడియనుండి
భ్రష్టమై నామమాత్రావశిష్ట మగుచు
నా యదృష్టంబు దెబ్బతిన్నది కుమార!

ఆ మహోజ్జ్వల వైదిక ఖ్యాతి - ఆ య
శోక సామ్రాజ్య వైభవస్ఫూర్తి - స్మృతికి
వచ్చినంతనె కన్నీరు వరదగట్టు
మందభాగ్యను నా కీర్తి మాసిపోయె.

కాఱుచీకట్లు గ్రమ్మిన ఖండములకు
ఒక మహాజ్యోతినై వెల్గు నొసగినాను;
బ్రతుకు భాగ్యాలు లేని ప్రపంచమునకు
పైడి పాతఱనై సిరుల్ పంచినాను.

తత మహోన్నత విటప సంతానశోభ
దశదిశల నిండ ఈ విశ్వధాత్రికెల్ల
మధుర చైతన్య మొసగిన మామకీన
భూరి కీర్తిద్రుమము మోడువారెనోయి!

కడుపు కక్కుర్తికై ఊడిగమున కోర్చి
మరణయాతనతో అవమానమలిన
పంక నిర్మగ్ననై అధఃపతిత నగుచు
పొక్కిపోతిని కాపాడు దిక్కులేక.

ఆ భయంకరదాస్య మహాంధకార
లోక మంవొక్క మెఱుపు తళుక్కు మనిమెః
ప్రణయ సామ్రాజ్యరోచిః ప్రబంధమట్లు
షాజహాఁ ప్రేమరాశి ముంతాజమహలు .

చలువ వెన్నెలతిన్నెగా స్ఫటికశిలల
మలచి కట్టిన ముంతాజమహలు నేడు
విశ్వమోహన సౌందర్యవిభవ మొప్ప
వెలుగుచున్నది నా కళా వీథులందు .

మధుర మంజుల ప్రేమ సమాధియందు
మునిగిపోయిన నవసుధామూర్తి బోలె
తతమహత్తర శిల్పమై తాజమహలు
వలపువెన్నెల గురిసె విశ్వంబు నిండ .

* * * * *

# శివప్రభ

అది యొక నీచదాస్యయుగమైనను - అప్పటిదాక - గౌరవా
స్పద మగు దృష్టితో మతవిచక్షణ అంతగ చూపనట్టి అ
భ్యుదయ పథాన మొగలు ప్రభుత్వము సాగినకారణాన నా
మదికి ఘటిల్లెనోయి ఒకమాదిరి యూరట గ్రుడ్డివెల్గుగా .

ఆసురవృత్తితో స్వజనహింసపట్టె - ఔరంగజీబు - సిం
హాసన మెక్కెగాని భరతావని మూర్ఛిలె; నా రవంత యా
శ్వాసము చచ్చిపోయె; మతవైర పిశాచము చిందుద్రొక్కె; దు
శ్శాసన దౌష్ట్య మెల్లెడ 'జిజియా' రూపెత్తె; మతంబు పేరటన్ .

హైందవులన్న వారి మతమన్నను గిట్టక ఆ తురుష్క రా
జ్యేందిర రక్తదాహమున నెందఱినో బలిగొన్న; దీనితో
ఎందఱినో ఫకీరుమత మిచ్చిన; చెప్పుట శాంతిలేదు; నా
పొందిన బాధ చెప్పుటకు పోలదు; గుండియ పచ్చిపుండురా !

మత విద్వేషము మూర్తిగైకొనియె; హింసాకాండ మెండయ్యె; నా
బ్రతుకే దుస్సహమయ్యె; ఆ యవనసామ్రాజ్యంబులో శాంతి భ
ద్రతలే శూన్యము లయ్యె; నా మతము - నా ధర్మంబు - నా శాస్త్రప
ద్ధతి - నా సాహితి - నా ప్రవర్తనము - నిందాపాత్రమైపోయెరా !

తోతులు త్రవ్వనేల ? యమలోకమురా అవురంగజీబు దు
ర్నీతి మతప్రభుత్వము; భరింపగరాని కఠోర శాసనా
ఘాతముచే ప్రజాహృదయ గహ్వరమం దొక విప్లవాత్మక
జ్యోతి జ్వలించె; దాస్యతిమిరోద్ధతి నల్గడ విచ్చిపోవగా .

ఆ యవనాధిపుండు దురహంకృతితో మతఖడ్గ మెత్తి నా
ఆయువు దీయ సిద్ధపడినప్పుడు - పుత్రులు - ధిక్కరించి రౌ
ద్రాయితమూర్తులై ఉడుకులారని నెత్తురు పొంగులెత్త జై
జై యని కత్తిదూసిరి; కసాయి తురుష్కులగుండె ప్రీలగా .

విజయ శ్రీనిధి - ధర్మమూర్తి - భరతోర్వీ శౌర్యవారాశి - మా
టిజియాబాయి పవిత్ర గర్భము - శివాజీనేత బాలారుణ
ధ్వజరోచిస్సులు దక్షిణాపథ ధరాభాగంబునం బర్వ నా
విజయ గ్రంథము వ్రాసెరా ఒక మహావేశంబు భాసింపగా .

నవయుగ మూర్తియై శివుడు నల్లని గుఱ్ఱము నెక్కి - దేశ వై
భవము సముద్ధరింపగ భవాని కృపాణము కేలదాల్చి - ఆ
యవన బలంబుపై కురికినప్పుడు - భారతవీర శౌర్య సిం
ధువు పులకించి పొంగినది; ధూర్తతురుష్క వినాశకారిణై .

ప్రాజ్య యశఃప్రతాపములు పాడయిపోవ పరాయికొల్వులో
పూజ్యత కోలుపోయిన స్వభూమికి జీవము పోసి - మెచ్చ సా
మ్రాజ్యము గూలద్రోసె శివరాజశిఖామణి; హైందవ ప్రజా
రాజ్య రమాలలామ తన ప్రాక్తన కీర్తులు కుప్పవోయగన్ .

ఆరని వీర విస్ఫురణ ఆ శివనేతకు దోడు మావళే
వీరులు క్రుద్ధులై యవనవీరుల చెండిననాడు - గుండె బే
జారయి బీజపూరు శివశబ్దభయాతురతన్ విపక్ష సం
హార మొనర్ప ధూర్తు డగు 'అఫ్‌జల్' ఖానును బంపె దండుతో .

చెలికారంబు నటించి ఖానుడు శివాజీతోడ ఏకాంత చ
ర్చలకై ఒక్కటగూడినప్పు డతి దుష్టస్వాంతుడై బిగ్గ కౌ
గిలి బంధంబున గొంతు నొక్క - శివుడున్ గీడెంచి ఉద్దండుడై
పులిగోళ్ళన్ వడిగ్రుచ్చి ఆ తురక ప్రేవుల్ దోడె ఘోరంబుగా .

ఖానుని చావుతో యవనఖడ్గము మొక్కలువోయె; బీజపూర్
పూనిక వ్యర్థమయ్యె; పొలివోయిన హైందవ ధాత్రి నిత్య క
ల్యాణము - పచ్చతోరణమునై పొలుపొందె; స్వతంత్ర వైభవో
ద్యాన మనోజ్ఞవీధుల విహార మొనర్చితి వీరమాతనై .

అవురంగప్రభు శక్తి చచ్చిసగమై ఆసేతు వింధ్యాద్రి ప్రా
భవ మెల్లన్ మొదలారిపోయినది; నిర్బంధంబుగా బహ్మనీ
యవనాధిక్యము దెబ్బతిన్నది; కుమారా! నా మహా వీరహైం
దవరాజ్యేందిర కొల్వుదీఱినది పూనా స్వర్ణపీఠంబునన్.

తానాజీ విజయప్రబంధ రచనా ధౌరేయుడై యొప్పగా
మౌనీంద్రుండు సమర్థ దేశికుడు ధర్మజ్యోతి వెల్గింపగా
ప్రాణుల్ చచ్చిన మ్లేచ్ఛభూపతులు గర్వభ్రష్టులై మ్రొక్కగా
పూనాలో శివనేత భారతయశంబుల్ పాతఱల్ వోసెరా:

ఆ సుముహూర్తమందె భరతాన్వయ శౌర్య మహార్ణవంబు వీ
రాసి తరంగ సంక్షుభితమై కడు ఘూర్ణిలె; ఉత్తరాన స్వే
చ్ఛాసుఖజీవన ద్యుతి దిశాతతి నిండగ దుర్గదాసు మ్లే
చ్ఛాసురకోటి నొంచి విజయ ధ్వజ మెత్తెనురా కృతాంతుడై.

ఆకలిగొన్న సింగములు - హైందవ యోధులు - మ్లేచ్ఛ సైనికా
నేకపమత్తకుంభముల నిల్వున జీల్చినవేళ - పాదుషా
తేకువ చచ్చి - మోగలు ప్రతిష్ఠలు గొప్పలు మాసిపోవగా
ఆకుల పాటుతో అపజయంబులకుం దలయొగ్గె ఖిన్నుడై.

ఒకదెస దుర్గదాసు - మఱి యొక్కదెసఁ శివరాజు - వీరులై
సకల మహీ ప్రజాభ్యుదయసాధనకై ఎదిరించి పోరగా
తికమక నొంది మ్లేచ్ఛపతి దిక్కఱి ఉక్కిరిబిక్కిరై తిలో
దకము లొసంగెనోయి। బహుధా పతనోన్ముఖ రాజ్యలక్ష్మికిఁ.

ముక్కలు ముక్కలై విరిగిపోయెను మొగలు ప్రాభవంబు; నా
చిక్కులు జారిపోయినవి; స్వేచ్ఛ ఘటిల్లెను; సుప్రభాతమై
దిక్కులు తెల్వినొందినవి; తియ్యని కోర్కెలు పల్లవింపగా
చెక్కు చెమర్పకుండ సుఖజీవన డోలిక నూగినానురా।

అప్పటిదాక చెప్పి గడియారమునం బదిరెండు కొట్టగా
చప్పున మాని ఆ జనని చాలిక లెమ్మని లోనికేగె; ఆ
చెప్పిన గాథలోగల విశేషములం దలపోసికొంచు నే
నప్పుడు భావజనాగతియందు మునింగితి మౌనమూర్తినై.



# ఆంగ్లదాస్యము

ఆ యపరాహ్ణమందు చివురాకుల చల్లని మావిక్రింద భ
ద్రాయిత మూర్తియై నవకుశాస్తరణంబున గూరుచుండి రా
మాయణ కావ్యముం జదువుమాతకు పువ్వులు దోయిలించి ఆ
త్మాయత భక్తితోడ హృదయార్పణ చేసితి ధన్యజీవినై.

పదములచెంత క్రొంబసరు పచ్చికపట్టున కొద్దిదూరమం
దెదురుగ గూరుచుంటి; జనయిత్రి - ననుంగని - సాశ్రునేత్రయై
చదువటమాని - మోమున విచారపరంపర రూపుదాల్ప - నా
హృదయ మెఱింగి స్వీయకథ యిట్లు పచించె; నెలుంగు రాపడగా.

తోరములైన సంపదలతో మితిమీఱిన దివ్యవస్తు సం
భారముతో సమస్తవిభవంబులతో తులదూగు నా శుభా
గారము చేరవచ్చిరి అగాథపయోధులు దాటి కూటికై;
పేరును ఊరులేని నిఱుపేదలు యూరపువాసు లెందఱో.

తిరిపెముకోసమై అరుగుదెంచిన తెల్లమొగాలవారు నా
కరుణకు పాత్రులై బ్రదుకు గాంచిన పిమ్మట మెల్లమెల్లగా
స్థిరపడి - ఓడవర్తకముచేయుచు - చక్కనిరేవు లున్న సా
గర పులిన ప్రదేశముల గట్టిరి కోటలు; యుక్తిమంతులై.

మూటల్ గట్టిరి తెల్లవర్తకులు నా మున్‌జూరు బంగారముల్;
కోటల్ మేటి పురంబులైనయవి; భోగుల్ భోగులైనారు; నా
నాటం బెంపగుచున్న వర్తకములోనన్ వారిలో వారికే
'పోటీ'లెక్కువయై క్రమ క్రమముగా పోరాటముల్ సాగెరా।

సాయుధులైన సైనికుల సాయముతో బలవంతులైన ఆం
గ్లేయులు - పోటరుల్ బుడతకీచులు - సాహసికుల్ పరాసులున్ -
దాయల రీతి దీకొనుచు, తగ్గినవారు స్వదేశరాజులన్
సాయము గోరుచున్, పగలు - స్పర్థలు - కత్తుల కెత్తినారురా।

అవిరళ విక్రమప్రభువులై తతభారత భావికర్తలై
చివరకు ఆంగ్లవర్తకులు - జిత్తులు నేర్చినవారు - స్వీయ శా
త్రవ విజయంబుతో జయపతాకము నెత్తిరి; నా ధరిత్రిపై
నవయుగ రాజ్ఞి శ్వేతరమ నవ్వుల చేదులు కుప్పవోయగా.

సూదులు దబ్బనంబు లయి - సుస్థిర ఖడ్గము లైనయట్లుగా
ఆదరు వేమిలేక బ్రతుకాసల వచ్చిన తెల్లవారు - రా
జాదిన మీద - సైనిక బలోన్నతి పొందిన మీద - రాజ్య సం
పాదనకై కడంగిరి సుమా! విభజించి జయించు నేర్పుతో.

ఇమ్మడి యైన భారతమహీశుల స్పర్థలు - హిందు మ్లేచ్ఛ భే
దమ్ములు - ఢిల్లిరాజుల యధఃపతనమ్ములు - దాగియున్న పై
రమ్ములు - తెంపులేని సమరమ్ములు - ఇన్నియుగూడి ఆంగ్ల రా
జ్య మ్ముదయింపజేసినవిరా ! నవదాస్యము గట్టికట్టగా .

భారత రాజకీయముల బాల్గొని పీలగునప్పు డెల్ల బం
గారము పండు భూము, లధికారపు ముద్రలు, పెద్దపెద్ద జా
గీరులు, నాచికొంచు బహు కృత్రిమరీతుల హూణ భారతో
ర్వీ రుచిరప్రబంధ గురుపీఠిక వ్రాసిరి ఆంగ్లవర్తకుల్ .

ఏపున భారతప్రభువు లెల్ల పరస్పర వైరకావ్య ము
ద్రాపకులై కటారిమొన దాఁకొను నప్పుడు - లాభసాటిగా
ఓపినమేర సాయపడి - ఉర్వీధనంబులు కొల్లగొంచు సం
స్థాపన చేసిరోయి భరతక్షితిమీద మహాంగ్లరాజ్యముల్ .

పాయలు పాయలై ధరణిపాలురు - చేవలు చచ్చి - అన్య దే
శీయుల ఖడ్గసంపదకు చేతులు చాచుచు కీలుబొమ్మలై
పోయిరి; తెల్లవారల ప్రభుత్వము గండము లన్నిదాటి దీ
ర్ఘాయువు పోసికొన్నది; శతాబ్దులు చూచిన వృక్షరాజుగా .

## ఆంగ్లదాస్యము

ప్రాభవము చచ్చిపోయిన పాదుషాలు
పౌరుషము మాసిపోయిన భరతనృపులు
ఆంగ్ల కరవాలమునకు దాసోఽహ మనిరి;
కటిక చీకటి గుంపులు గ్రమ్మెదెసల.

ఆహిమాచలసేతు పర్యంత ధాత్రి
మహిమ గోల్పోయి ఆంగ్లసామ్రాజ్య మయ్యె;
తిరిపమున కిందు వచ్చిన తెల్లవారు
బ్రదుకు భాగ్యాలు శాసించు ప్రభువులైరి.

ఆ భయంకర యవన దాస్యంబునుండి
శివుని కృపవల్ల నెట్టులో స్వేచ్ఛవడసి
నవ్య చైతన్యముం గన్న నాకు - మరల
పఠాణ దాస్యమ్ము తప్పలేదోయి తనయ!

ఏ నొనర్చిన పాప మదేమొ కాని
ఊడిగముతోనె నా బ్రతు కుడికి పోయె;
కొడుకు లున్నారు లెక్కకు కోట్లకొలది;
తల్లి వెత దీర్పలేని ఉద్దండులోయి!

ఉడుకు లెత్తిన యా మ్లేచ్ఛ యుగమునందు
నా మనశ్శాంతి దెబ్బతిన్నది కుమార !
పౌరుషము చచ్చిపోలేదు; భాగ్యనిధులు
తరలి పోలేదు; నా సముద్రాలు దాటి .

అన్యదేశీయులైనను యవను లెల్ల
ఇదె స్వదేశంబుగా వసియించినారు;
కోట్లకొలది సిరుల్ కొల్లగొన్న నేమి
మాసిపోకుండ నా కీర్తి మలచినారు .

ఇతర మతములపై కత్తి నెత్తుకున్న
మొగలు సామ్రాజ్యమే పడిపోకయుండు;
ఊచముట్టుగ నా యిల్లు దోచినట్టి
హూణ దాస్యమే నాకు లేకుండునోయి !

మహిమ గాంచిన నెమిలి సింహాసనంబు
కోట్ల విలువకు మించిన 'కోహినూరు'
చిరతర ఖ్యాతిగన్న నా శిల్పనిధులు
నాకు లేకుండ పోయెనురా కుమార !

అర్పగా రాని మతకలహాగ్ని నూది
మేను తపియింపజేసిరి మ్లేచ్ఛపతులు;
మంచిగా గుండె గోసిరి మత్తువెట్టి
తేనె పూసిన కత్తితో తెల్లదొరలు .

అవధి యెఱుగని హిందూ మహమ్మదీయ
మత విరోధంబు స్వీయ సామ్రాజ్యమునకు
రక్షగా ఆంగ్లనృపులు నా ప్రజలనెల్ల
మంచిగా విభజించి పాలించినారు .

తమ ప్రభుత్వంబు భారతధాత్రిమీద
స్థిరముగా వేళ్ళుదన్ని వర్థిల్లునట్లు
చేసినారెన్నొ నిర్బంధ శాసనాలు;
కిక్కురనకుండ గొంతు బిగించినారు .

యవన సామ్రాజ్య పతన హేతువు నెఱిఁగి
మత సహిష్ణువులై పైకి మంచిగాను
జాతి నిర్వీర్య మగునట్టి శాసనముల
ఆర్య సంస్కృతి చెఱచిరి ఆంగ్లపతులు .

హైందవ మహమ్మదీయ సమైక్యమునకు
చీలు లేకుండ మతవిభేదాలు పెంచి
శాంతిపేరిట నా ప్రజాస్వామ్యములను
అణగద్రొక్కిరి దాస్యమ్ము లతిశయింప.

కత్తి బట్టిన శిక్ష; నోరెత్త శిక్ష;
కలము సాగింప శిక్ష; మార్వలుక శిక్ష;
పలువు రొకచోట గూడినందులకు శిక్ష;
ఆంగ్లనృపుల శిక్షాస్మృతి కవధిలేదు.

పలుకు తేనెల లోనిచేదులనుగప్పి
మాయసుఖములు గల్పించి మచ్చుజల్లి
కొల్లగొన్నారు టక్కరి తెల్లదొరలు
భారత ధరిత్రి భాగ్యాలు పౌరుషాలు.

విశ్వవిఖ్యాతి గన్నట్టి స్వీయచరిత
మఱచిపోయినదోయి నా భరతజాతి;
సమర పౌరుషశక్తికి స్వస్తిచెప్పి
ఊడిగ మొనర్పనే తలయొగ్గెనోయి!

# భారత వీరలక్ష్మి

నాడుగా నాటికి ఆంగ్లరాజ్యమున అన్యాయాలు కొండంతలై
పాడై పోయెను శాంతి భద్రతలు; నిర్బంధాలకుం జిక్కి అ
ల్లాడెగా భారతజాతి; క్రూరు డగు 'డల్హౌసీ' ప్రభుత్వంబులో
పీడల్ కుప్పలు తిప్పలై పెరిగి విద్వేషాలు తీవ్రించెరా !

తుకతుక లాడు చిత్తములతో గతులారిన పౌరుషాలతో
కకవికలైన జీవన సుఖమ్ములతోడ తపియించిపోయి - మూ
షిక బహుళప్రజాసమితి మాయలమారి విదేశదాస్య నా
శక సమర ప్రయత్నమున సాగినదోయి సమైక్యశక్తితో .

సానల్ దీటిన వాడికత్తులవలెగా చట్టాలు బాధింపగా
సేనానీకమునందు ముందుగ జనించెగా ద్వేష; మామీద సం
స్థానాధీశులలో అతృప్తి ప్రబలెగా; సర్వత్ర స్వాతంత్ర్య దీ
క్షా నిర్ఘోషము మాఱుమ్రోగినదిరా 'కానింగు' కాలంబులో

స్వాతంత్ర్యమ్ము లవమ్ములేని 'ఐరోపావారి' దుస్తంత్ర దు
ర్నీతిక్రూర దురంత దుస్సహ నియంతృత్వమ్ము నా మూలముగా
గోతిం బెట్టగ దీక్షగైకొని తురుష్కుల్ హిందువుల్ విప్లవ
జ్యోతిం దద్ద జ్వలింపజేసిరి రిపుస్తోమంబు కంపింపగా .

అతివేగంబున కొఱచిచ్చుపగిదిఁ ఆ విప్లవజ్వాల భా
రత మందెల్లెడ ప్రజ్వరించినది; నిద్రాముద్రితం బైన భా
రత జాతీయత మేలుకొన్నది; కుమారా! దాస్యబంధాలతో
పతితంబైన మదీయ శౌర్యము ప్రదీప్తంబై విజృంభించెరా.

వేడిమి నిప్పులం గురిసి విప్లవ వీరులు దిక్కు-దిక్కులఁ
దాడి యొనర్చి వీరశపథంబులు గైకొని తెల్లమూకలఁ
జీడ పురుంగు లట్లు వధచేసిరి; దోచిరి కోటలెన్నొ; చెం
డాడిరి క్రూర శాసన భయంకర దాస్యపిశాచ శక్తులఁ.

యావద్భారతభూమి అట్టుడికినట్లై పోయె; ఆంగ్లేయులుఁ
చేవల్ చచ్చినవారలై చెడిరి; కచ్చెల్ గ్రక్కు ఖడ్గాలతో
చావో స్వేచ్ఛయొ తేల్చుకొందమను దీక్షఁ నా సిపాయీలు ఏ
రావేశంబున విక్రమించిరి కుమారా! దాస్యవిచ్ఛిత్తికై.

బరహాంపూరున బుట్టి - వంగమున దీప్తంబై - ప్రయాగంబులో
చుఱుకుం బోకలు చూపి - ఢిల్లిపురిలో శోచిస్ఫులం గుప్పి - చె
చ్చెఱ పంజాబును చుట్టు ముట్టికొని - ఝాన్సీలో మహాజ్వాలయై
పరగెఁ విప్లవ వహ్ని భారత ధరా స్వాతంత్ర్య సుజ్యోతిగా.

# భారత వీరలక్ష్మి

పదియును నెన్మిదేండ్లుగల బ్రాహ్మణ బాలిక - ఝాన్సిలక్ష్మి సం
పదలకు దూరమై బ్రదుకు భారము మోచిన భర్తృహీన - తె
ల్లదొరల దుష్టశాసనములకా దురపిల్లిన రాణి - మామ కా
ష్ప్వదయము గోరి కత్తిగొనె నోడక భారత వీరలక్ష్మియై .

వీరము చిందగా పురుషవేషముతో జవనాశ్వ మెక్కి - న
వ్వారుణ పాణిపల్లవమునందు కృపాణము వాడిగ్రక్కి - ఆ
భారత వీరనారి పరిపంథి బలంబులు దద్దరిల్ల దో
స్సారము చూపినప్పటికి యశఃకథ మై పులకింపజేయురా ।

ఆ యపరూప విప్లవ మహాప్రళయాంతక వీరవాహినీ
నాయికయై ప్రజా విజయ నాటకమందు నటించె లక్ష్మి ఆ
శ్రేయను కన్యవోలె; రణశూరులు - హూణులు ప్రాణభీతితో
పాయలు పాయలై విరిగి పారిరి; చేవలు తూలిపోవగా .

ముం దడుగై స్వరాజ్యరణముకా నడిపించిన ఝాన్సిలక్ష్మి మ
ధ్యందిన భానుబింబము విధంబున నిప్పులు గ్రుమ్మరింపగా
కొందల మంది - కంది - వగ గూరిన డెందముతోడ - హూణ రా
జ్యేందిర సంతసించినది; ఏడ్పులు వార్ధులు దాటిపోవగా .

కసిగొని ఆంగ్లసైనికులు కత్తుల నూఱుచు ఝాన్సికోటపై
ముసరి - మహాట్టహాసమున ముట్టడి చేసి - ఫిరంగి మ్రోతలో
బెసలు పగిల్చినారు; వెనుదీయక అగ్గల కెత్తినారు; సా
హసములు చూపినారు; విజయధ్వజ మచ్చట పాదుకొల్పగా.

దారుణమయ్యె యుద్ధము; శతఘ్నుల భీషణఘోష హెచ్చె; నా
భారత వీరలక్ష్మి కరవాలము సానలుదీఱి శత్రుసం
హార మొనర్పసాగె; వెనుకాడక విప్లవవీరులెల్ల దు
ర్వార పరాక్రమాన రుధిరంబులు గార్చిరి స్వేచ్ఛకోసమై.

పట్టిన పట్టు వీడక తుపాకులు ప్రేల్చుచు, దొంగచాటుగా
ముట్టుచు, ఆంగ్లవాహినులు ముం దడుగైనవి; విప్లవప్రజా
ఘట్టము మారిపోయినది; కాల భుజంగము ఫూత్కరించె; త
ట్టిట్టనరానిదై సమరవృత్తము సారెకు మారిపోయెరా!

అనల ప్రోజ్జ్వల వీరవిక్రముడు - 'తాంత్యాతోపె'; స్వాతంత్ర్య దీ
క్షను చాటించిన మేటి - గ్వాలియరు పీష్వా దండుతో నెత్తి ఝా
న్సిని రక్షింపగ వచ్చుచుంట విని మున్నే ఆంగ్లసైన్యాలు వం
చనతో దారులు గట్టి వారల చమూసర్వస్వముం దోచెరా!

పతనం బైనది ఝాన్సికోట; బలముల్ పాడయ్యె; నా లక్ష్మి దు
స్థితి పాలైనది; హూణసైనికులు కచ్చెల్దీట ఝాన్సీ ప్రజా
తతి నొక్కుమ్మడి కాల్చిచంపిరి; మహా దౌష్ట్యంబుతో విప్లవ
ష్యతికై త్రాగిరి పచ్చినెత్తురు; జనక్షోభంబు మిన్నంటగా.

ధ్వంసమున వా రొనర్చిన పిశాచపు హింసలు చెప్పలేను; వి
చ్చలవిడి కొల్లగొట్టిరి ప్రజావిభవంబులు; మానభంగముల్
సలిపిరి; వారు వీరనక చంపిరి చిక్కినవారి నెల్ల; ని
ప్పులు దరికొల్పి పట్టణము బూడిద చేసిరి దారుణంబుగా.

వెసలం బాటిన గుండుదెబ్బ; గృహమందే యున్న కార్చిచ్చు; రా
క్షస రాజ్యం బనిపించె శత్రుకృత హింసాకాండ; ఝాన్సీ ప్రజా
వ్యసనంబుల్ మఱువంగరానివి సుమా। ఆబాలవృద్ధంబుగా
మసియై పోయిరి; అంత పట్టణము నిర్మానుష్యమై పోయెరా।

అంతలు క్రౌర్యముల్ సలిపి - ఆసురవృత్తిని భారతప్రజా
స్వాంతము నొవ్వజేసినది చాలక - మామక లక్ష్మినిం బదా
క్రాంతగజేసి - యెట్లయిన ఖైదున బెట్టి - పతాక మెత్తగా
అంతిపురంబు నద్దెసల ఆంగ్లబలంబులు మోహరించెరా।

తన్ను చెఱంగొనఁ నగరివారలు గావిన తెల్లమూకలఁ
వెన్నున గ్రుమ్మి - దూసికొని - విప్లవ భారతవీరలక్ష్మి పై
కొన్న బలంబులం జితుకగొట్టి - తటిల్లతవోలె మాయమై
తిన్నగ 'కాల్పికిం' జనియె; దేశ సముద్ధరణైక దీక్షతో .

తనకుం గాపుగ నందు నెక్కొనిన తాంత్యాతోపె సైన్యంబులం
గొని - ఆ వీరకుమారి పౌరుషము పొంగుల్ వాఱు ఖడ్గంబుతో
మును మున్నై వెనుకొన్న 'ఠాకరు' బలమ్ముఁ జించి చెండాడె;
చిన మోమెత్తక హూణనాయకుఁడు కచ్చెల్ చచ్చి పర్వెత్తగఁ .

అటు నిటుగాని యుద్ధవిజయంబును దేల్చగ విప్లవప్రజా
పటలము లెల్ల గ్వాలియరు పట్టణ వీధుల గుంపుగట్టె; ఆ
చటుల చమూచయంబులకు సంగర శిక్ష నొసంగి లక్ష్మి అ
న్నిటికిని తానయై రణ మనీషలు పెక్కులు నూరిపోసెరా

పగ సాధింపగ తెల్లవారును రణవ్యాపార పారీణులై
తగు సన్నాహముతోడ గ్వాలియరుపై దండెత్త నా వీరులుఁ
దెగువఁ దాస్యవిముక్తికై రిపుబలాధిక్యంబు లెక్కింప కు
గ్రగతిం బోరిరి భారతీయ సమరక్షేత్రంబు పొంగారగా .

వీరము రూపుగొన్న మగవేషముతోడ అమోఘఖడ్గయై
వీరతురంగ మెక్కి రణశేముషి మీఱగ వైరివీరసం
హార మొనర్చుచుఁ అసివిహారమొనర్చెడు ఝాన్సిలక్ష్మి యా
కారము గాంచినంతనె వికావికలైనవి ఆంగ్లసైన్యముల్.

తమ సామ్రాజ్యము భారతక్షితిని సంస్థాపింప నాంగ్లేయులుఁ
తమ వైదేశిక దాస్యబంధముల నుద్ఘాటింప నాబిడ్డలుఁ
సమరక్షేత్రమునం దెదుర్కొని పగల్ సాధించుకొన్నట్టి వి
క్రమ గాథల్ మఱవంగరానివి కుమారా! నాప్రజాకోటికిఁ.

భరతోర్వీ వివిధ ప్రజాసముదయ స్వాతంత్ర్యయుద్ధంబులో
గుఱుతింపందగు పూర్వభాగమిది; నాకుఁ దాస్యమో స్వేచ్ఛయో
స్థిరమై పోగలఘట్ట; మందుకని ఝాన్సీరాణి కల్పాంత భీ
కర శక్తింబలె గాపుగొన్నది మహాక్రౌర్యంబుతో శత్రువుఁ.

ఆవేశంబులు హెచ్చిపోయినవి; తాంత్యాతోపె ఉద్దండుఁడై
చావుల్ కుప్పలువోసె; ఒక్కమొగి పీష్వా వీరఖడ్గంబుతో
ప్రేవుల్ దోడెను; కాని యుద్ధవిజయశ్రీ దూరమైపోయె; నా
చేవల్ వైరిఫిరంగి కాల్పులకు భస్మీభూతమై తూలెరా!

బలములు తగ్గిపోయినవి; భారత విప్లవ వీరకోటికిన్
గెలుపులు చచ్చిపోయినవి; కేవల కృత్రిమ శ క్తితోడ నా
దళముల చీలదీసి - బహుధా హతమార్చిరి తెల్లవార; లా
ప్రళయ మొకింత సంస్మృతికి వచ్చిన దుఃఖము పొంగి పొర్లురా !

సమరము చేసిచేసి - రిపుసైనిక కోటుల చంపిచంపి - వి
క్రమములు చూపిచూపి - కొడుకా ! కనుమూసెను వీరలక్ష్మి; దై
వము పగబూనె; విప్లవ కృపాణము ముక్కలు ముక్కలయ్యె; భం
గములకు జిక్కి నాబ్రతుకు కష్టపరంపర క్రాగిపోయెరా !

పొంగెడు కాకలన్ మనసు పొక్కగ - చెప్పగలేక - తల్లి ! క
న్నుంగవ మూసె; ఆజనని నొవ్వ కనుంగొనలేక సూర్యు ద
స్తంగతుడయ్యె; అంధతమసంబులు దిక్కులు గ్రమ్మె; భారత
ప్రాంగణమందు ఊఁటిగపురక్కసి నిక్కుచు చిందుద్రొక్కగా.

# అహింసా సమరము

కలువ పూదొరసాని స్వాగతము పలుక
వెన్నెల పులుంగు జవరాలు వినుతిసేయ
దెసల గప్పిన చీకటితెరలు చించి
విశ్వమోహన చంద్రుడు వెలిగె మింట.

బహుళపంచమి వెన్నెల పాన్పుమీద
ప్రకృతి సుకుమారి హాయిగా పవ్వళించె;
చెదరిన మనస్సుతో నేను నిదురరాక
పొరలు చుంటిని తలపు దొంతరలు పొరల.

అపుడు జగదంబ మెల్లన నడుగు లిడుచు
ఆ కుటీరాంగణము దాటి అవల కరిగె;
ఏమితోచక వెనుకొని యేనుగూడ
సాగిపోతిని పూదోట సరసికడకు.

కొలని సోపానములమీద గూరుచుండి
వెన్నెల జగత్తు గనుచుండె విశ్వజనని;
కష్టసాగర మీదిన కలువకన్నె
వెలుగుచీకట్ల మర్మాలు విప్పిచెప్పె.

ఆ ప్రశాంత నిశీథమం - దామనోజ్ఞ
చంద్రికారామమున - జగజ్జనని హృదయ
మెంతగా తపియించెనో యెఱుగరాదు;
నిండిపోయెను కొలను కన్నీటితోడ.

అమ్మ దుఃఖమ్మునకు హృదయమ్ము పొక్క-
కొయ్యమాదిరి నేనందు గూరుచుంటి;
కడవల కొలందియేడ్చి నాకన్న తల్లి
ఎట్టకేలకు ననుజూచి యిట్టులనియె.

నావిషాద కథా శ్రవణంబువలన
ఖేదమేకాని మోదమ్ములేదు నీకు;
అవధి యెఱుగని పారతంత్ర్యమున మునిగి
బ్రతుకవలసిన దుర్గతి పట్టెనాకు.

ఝాన్సి పతనంబుతో స్వేచ్ఛ చచ్చిపోయె;
అపజయంబులతో సౌఖ్య మంతరించె;
ఆంగ్లరాజన్య నిశితాసి కంజలించి
దాసినైపోతి; నాఖ్యాతి మాసిపోయె.

పగలు సాధింప విప్లవప్రజలనెల్ల
ఆంగ్లపరిపాలకులు హత మార్చినారు;
చండశాసనములు చేసి జాతినెల్ల
నాశన మొనర్చినారు నానావిధాల.

ఉన్నతోద్యోగవాంఛ పెంపొందజేసి
భాషపై దెబ్బకొట్టిరి ప్రథమమందె;
హైందవ మహమ్మదీయ సమైక్యశక్తి
చీలదీసిరి మతవిభేదాలతోడ.

వేషములుమారె; భాషలు వేఱుపడియె;
మతము సంకరమయ్యె; ధర్మము నశించె;
సిరులు చెడిపోయె; సంస్కృతి చెదరిపోయె;
భారతీయత సర్వథా పతితమయ్యె.

సమర పౌరుష శక్తికి స్వస్తి చెప్పి
స్వేచ్ఛకు తిలోదకము లిచ్చి - సిగ్గుమాలి
నాప్రజలు తెల్లదొరల మన్ననలు గోరి
పారతంత్ర్యాలు పెంచుకొన్నారు తనయ !

పలికెడి భాషలో - మెలగు పద్ధతిలో - మనునట్టి వృత్తిలో -
లలితకళా ప్రవర్ధన కలాపములో - సుఖభోగతృష్ణలో -
తొలకినవోయి దాస్యములు; దూష్యములైనవి మామకాగమో
జ్జ్వల నయధర్మపద్ధతులు; సాంఘిక జీవన సంప్రదాయముల్.

పరువు ప్రతిష్ఠ లేగినవి; భారత సభ్యత మాసిపోయె; దు
ర్భర మగు దాస్యజీవనమె స్వర్గసుఖం బనిపించె; తెల్లవా
చటికము నన్ను జూచి యెకసక్కెములాడె; మదీయ శౌర్య సా
గరములు వట్టిపోయె; కొడుకా! భరతావని గొడ్డుపోయెరా!

ఊరట లారిపోయినవి; ఊకిగముల్ తలమున్కలయ్యె; స్వే
చ్ఛారుచి చచ్చిపోయినది; శాసనదౌష్ట్యము మేరమీరె; ఆ
ఘోర దురంతదాస్యములకుం గుదురై యెదురాడ్తశేక నా
భారతజాతి ఆంగ్లపరిపాలనలో తపియించె పోయెరా!

"దొరలకు సేవజేయుటకె తూరుపుసీమల నల్లజాతు లీ
ధరపయి సృష్టమైన"వని దర్పమెలర్పగ శ్వేతజాతి క్రా
వరములు కుప్పవోసినది; వర్ణవిభేదము చాలపెంచి నా
భరత కుటుంబగౌరవము పాడొనరించిన దెల్లభంగులన్.

అతి నీచం బగు దాస్యజీవనముతో నన్నింటికిం జచ్చి - పూ
జ్యత కోల్పోయి - పరాభవంబులకు లోనై కుందు నాకుఁ స్వతం
త్రత చేకూర్పగ శాంతిమార్గమున దాదాభాయిసౌరోజీ భా
రత జాతీయత సభాముఖంబునను పోరాటంబు సాగించెరా !

స్వాతంత్ర్య ప్రియులైన నాప్రజ లహింసాశక్తితో సత్యముఁ
నీతిం దప్పక - నవ్యవిప్లవ మహాగ్నిం బ్రజ్వలింపించి; యూ
హాతీతం బగు నాయపూర్వసమర వ్యాపార సంరంభముఁ
గోతిం బెట్టగ తెల్లరాచటీక మెగ్గుల్ కుప్పలం బోసెరా !

వందేమాతర మంచు నాసుతుడు సావర్కారు నాదాస్యపుం
బందాలఁ దెగగొట్టి స్వేచ్ఛ గలిగింపఁ దేశదేశాలకుఁ
సందేశమ్ములు పంపి - విప్లవ కృపాణజ్వాల దీపింపగా
ముందై ధీరతతో స్వరాజ్యసమరమ్ముఁ దాను సాగించెరా !

ఆ యసమాన విప్లవ భయంకర శక్తికి దద్దరిల్లి - ఆం
గ్లేయులు క్రూరదైత్యులవలెఁ దయమాలి - ప్రచండశాసనో
పాయ బలప్రయోగముల భారతరక్తము ద్రావినారు; నా
శ్రేయము గోరినట్టి జగజెట్టుల ఖైదున బెట్టినారురా !

సానత్కారు మహోద్యమం బొక మహాసందేశమై యొప్పగా
యావద్భారతభూమి మేలుకొనె; నవ్యంబైన స్వాతంత్ర్య వాం
ఛావత్తిష్ఠపులై ప్రజల్ కదిగి పాశ్చాత్యప్రభుత్వంబుపై
నావేశంబులు గ్రక్కుచోయి కొడుకా! కష్టాలు రాపాడగన్.

అరికట్టం బడినట్టి స్వేచ్ఛకొఱకై ఆసేతుశీతాద్రిగా
తిరుగంబడ్డ ప్రబుద్ధభారత ధరిత్రీనాయక శ్రేష్ఠుడై
తురిసెన్ నిప్పులు లోకమాన్యుడు; బొరల్ క్షోభింప స్వాతంత్ర్య సం
గరమున్ దీవ్రమొనర్చె; శాసన తిరస్కారంబు సాగించుచున్.

ఘనుడైనట్టి తిలక్ప్రభుండు జయశంఖం బొత్తియేకాంక్షకున్
తనఖా పెట్టని వీరకంఠమున "స్వాతంత్ర్యమ్ము నా జన్మహ"
క్కనుచుం జాటె; స్వరాజ్యసిద్ధికొఱకై ఆంగ్లేయ సామ్రాజ్య శా
సన దౌష్ట్యంబు నెదిర్చిపోరె; భరతక్ష్మాశౌర్య వారాశియై.

మూకలు మూకలై ప్రజలు ముందుకువచ్చి - ప్రభుత్వపౌష్ట్యమున్
తేకువతో నెదిర్చి - వెనుదీయక పోరిరి; సత్యదీక్షతో
వాకొనరాని శాసనవిపత్తుల కోరిచి - మేరమీఱు న
ష్టాకలకుం దలంకక - వెఱంబడి మ్రగ్గిరి; స్వేచ్ఛకోసమై,

ప్రచండ కఠోర శాసన పిశాచబలంబున హూణనాయకుల్
కొండలపెట్టు దౌష్ట్యములు కుప్పలువోసిరి; విప్లవ ప్రజా
మండలి ప్రేవులూడ్చిరి; అమానుషచర్యల నాడు నెత్తురుల్
పిండిరి; లోకమాన్యు జెలబెట్టిరి 'మాండలె' పట్టణంబులో.

శాంతిపేరిట చండశాసనాలు రచించి
నొవ్వకుండగ నోరు నొక్కినారు
ధర్మంబుపేరిట తగని నిర్బంధాలు
గల్పించి చేతులు గట్టినారు
ఛత్రంబుపేరిట పశుబలంబును జూపి
స్వాతంత్ర్యశక్తుల జదిపినారు
ప్రభుభక్తి పేరిట పదనుకత్తులు నూరి
కొదుకక గొంతులు గోసినారు

గోముఖ వ్యాఘ్రములరీతి కుటిల చిత్తు
లాంగిలేయులు దేశమం దన్నికడల
భరతపుత్రుల పౌరుషప్రభలు మాపి
నీచ దాస్యాంధ తమసాలు నింపినారు.

హాయుని దీక్షతో చెఱలపాలయి - నాకొఱ కెందఱెందఱో
నాయకు లీ నిరాయుధ రణవ్యధలం దపియించి - జీవితా
ధ్యాయములన్ ముగించిరి: భయంకర శిక్షలతోడ హూణదై
తేయులు విప్లవప్రజల తేకువ లూడ్చిరి నిర్దయాత్ములై.

క్రోధము ముద్రవైచిన విరోధుల బాధలకోర్చి - బాల గం
గాధరమూర్తి మామక విఘట్టిత దాస్యవిమోచన క్రియా
సాధనకై తపించి - చెఱసాలకు జీవిత మప్పగించె; ఆ
గాధలు చెప్పలేను నరకాలు తొలంకెను నాగృహమ్ములో.

ఆ దరిలేని దాస్యనిబిడాంధము రూపఱిపోవ - కర్మచం
ద్రోదయ మయ్యె; విప్లవ మహోదధి పూర్ణతరంగమయ్యె; నా
వేదన లారిపోయె; రిపువీరుల గుండెలు తల్లడిల్లె; స
ర్వోదయ శోభతో రణమహోద్యతి నూత్నపథంబు ద్రొక్కెరా!

కొండలపెట్టు బాధలకు గొంకక-ఇంకక-దక్షిణాఫ్రికా
ఖండములోని నాప్రజల కష్టములార్పిన వీరయోధ; బ్ర
హ్మాండము ప్రాంజలించిన మహాత్ముడు; సత్యము-శాంత్యహింసలుగా
పండినచేను; గాంధి నవభారతశక్తుల మేలుకొల్పెరా!

అంచిత సత్యదీక్షను సహాయనిరాకరణోద్యమంబు సా
గించి ప్రభుత్వశక్తి వణకించెను; శాసనధిక్కృతిం బ్రయో
గించి స్వరాజ్యకాంక్ష వెలిగించెను; మామకపౌరుషంబు రూ
పించి స్వతంత్రసేన నడిపించెను; గాంధి అమోఘశక్తితో.

అది అపరూపసృష్టి; యొక యాయుధ మన్నదిలేదు; వైరితో
నెదురెదురై బలంబు మెఱయించిన దేమియులేదు; దొమ్మిగా
కదియుట లేదు; చిత్రము! జగంబు లెఱుంగని క్రొత్తఫక్కిలో
కదనము సాగెనోయి! బహుకాలము నెత్తురు చిందకుండగన్.

ఆగ్రహ మెట్టిదో యెఱుగనట్టి కుమారులు - వేనవేలు స
త్యాగ్రహు లీ నిరాయుధ మహాహవ భూమికి పర్వులెత్తి - అ
త్యుగ్ర కఠోరశాసన సముత్కట హింసల కోర్చుచున్ మనో
నిగ్రహశక్తితో నెదురు నిల్చిరి వైరితుపాకిగుండ్లకున్.

ఆటోపంబులు మాని శాంతిసమర వ్యాపార పారీణులై
లాటీదెబ్బల కోర్చుచున్ సహనమున్ లక్షించుచున్ హింసకుం
జోటీకుండ నెదిర్చిపోరు ప్రజలన్ స్రుక్కించి నానావ్యథా
కౌటిల్యంబులు కుప్పవోసినది ఆ[illegible]భవం బక్కటా!

చెలులకు నోర్చి ఱాటిగవుజేదులు మ్రింగుచు దీక్షతోడ సం
గర మొనరించు యోధులకు గాంధి మహాత్ముడు మార్గదర్శియై
కలిపె నమోఘశక్తిగల ఖద్దరు మంత్రము; తెల్లవారి రా
చఱికపు మాయదోపిడి పిశాచము కెవ్వన కేకవెట్టగన్.

ఖాదీ గట్టి "స్వతంత్రభారతికి జై। గాంధీకి జై" యంచు-ఏ
కాదర్శంబున నాకుమారులు స్వరాజ్యశ్రీ జయోత్కంఠతన్
మీదై నిల్వగ - ఆంగ్లపాలకులు గుండెల్ జాటి - పిచ్చెత్తి - హిం
సాదౌష్ట్యంబులు రాశిపోసిరి; అహింసా యుద్ధరంగంబులో.

అసహాయోద్యమ విప్లవంబు ప్రబలం బై రేగి; హింసామలీ
మస దుశ్శాసన దౌష్ట్యధిక్కృతులు బ్రహ్మాండంబుగా సాగె; దే
శ సమారాధన దీక్షపెంపున అహింసాకంధి - మాగాంధి బా
నిసముం గాల్చె; విదేశవస్త్రదహనాగ్నిం బ్రజ్వలింపించుచున్.

"ఊరక పండు ఉప్పునకు ఒక్కరిపెత్తనమేల? అర్ణవ
క్షారజలంబు తెచ్చుకొనగాదని శాసనమేల? ఏమి యీ
దారుణ" మంచు డీకొనియె దండి మగండయి గాంధియోధ; ఊ
రూరను శాంతిసైనికుల ఉప్పుకొటారులు నిండిపోవగా.

పేరు గలట్టి నాభరతవీరులు ముందడుగై స్వరాజ్యల
క్ష్మీరమణీ కరగ్రహణ సిద్ధికిగా సమరాంగణంబులో
వీరము వారువోసి బలిపెట్టిరి ప్రాణధనంబులెల్ల; ఆ
వీరకుమార సింహముల విశ్రుతగాథలు చెప్పశక్యమే ?

విజయ పరంపరల్ భరతవీధుల కుప్పలుపోసి - ఆంగ్లభూ
భుజుల వణంకజేసిన చమూపతి - గాంధిపథానుయాయి - మా
లజపతిరాయి ఉగ్రుడయి - లాహోరుసీమల గర్జవెట్టగా
గజగజలాడెనోయి ! ఉడిగంపు మదేభము తత్తఱించుచున్.

కలకత్తా నగరంబులో జయపతాకంబెత్తి - స్వాతంత్ర్య దీ
ప్తులు బంగాళమునిండ - శాంతిసమరవ్యూహాలు చిత్రించి - ది
క్కులు కంపింపగ చిత్తరంజనుడు దీకొన్నప్పు డాంగ్లేయయో
ధులు త్రాణల్ చెడి కచ్చెకొద్ది అవినీతుల్ గుప్పిరున్మత్తులై.

సమరక్షేత్రము పొంగులెత్త విజయోత్సాహాన "బార్డోలిసిం
హము-" సర్దారు పటేలు భీమబలుడై ఆంగ్లేయ దుర్దాంత దు
ర్దమ దుశ్శాసన దుష్టశక్తి హతమార్పం బూనుకొన్నప్పు డొ
క్కమొగిన్ ఘూర్జర శౌర్యసింధువు మహాకల్లోలమై ఘూర్ణిలెన్,

వీరము పంచి - చెన్నపురివీధుల కోడెతెలుంగు పౌరుష
శ్రీ రుచి జాలువాఱ - జగజెట్టి ప్రకాశము హుంకరించుచుఁ
వైరి తుపాకిగుండ్లకు సవాలని ఱొమ్మును జూపి నిల్వగా
బీరము దక్కి ఆంగ్లరిపువీరులు తెల్లమొగాలు వెట్టరే ?

వీరేకాదు - మఱెందఱో ప్రముఖు లీస్వేచ్ఛారణక్షోణిలో
వారుల్ వోసిరి వేడినెత్తురు; లపూర్వత్యాగ శాంతిక్షమా
ధౌరంధర్యముతో సహించిరి దురంతక్లేశ సంక్షోభముల్;
వారొక్కొక్కరి కష్టగాథ వినిపింపన్ గుండె నీరౌనురా.

"ఈసత్యాగ్రహ యుద్ధపద్ధతులతో ఎన్నేండ్లు పోరాడినఁ
గానంతేని ఫలంబు గల్గ" దనుచుఁ ఖడ్గంబు చేబూని హిం
సాసిద్ధాంతము నమ్మి పోరిరి జయాశఁ గొందఱుద్దండులై;
ఆ సాంగ్రామిక వీరవృత్తములు మాయంబోవు నాగాథలో.

తనయా ! అంపపితూరి నాయకుడు - సీతారామరా జొక్కఁడే
ఘనుడై మన్నెపుసీమలో విజయశంఖం బొత్తి స్వాతంత్ర్య దీ
క్షను దండెత్తిననాడు - కాలు నిలుపంగాలేక ఆంగ్లేయ సై
న్యనికాయంబులు పర్వులెత్తినవి; భగ్నస్థైర్య ధైర్యాలతో.

పాయక నాప్రతాపగుణపాఠము నేర్పిన నవ్యభారతా
మ్నాయమునందు - ఎన్నటికీ మాయని పూర్ణమనోజ్ఞ గీతికా
ధ్యాయము వ్రాయగల్గిన ఉదాత్తచరిత్రుడు - బోసుబాబు ఆం
గ్లేయుల ప్రాభవంబు వణకించెను వీరకృపాణపాణియై.

కులమత వర్గభేదములు కూలగద్రోచి - అఖండ భారతో
జ్జ్వల చరితంబువ్రాసి - నవభారతనేతగ అండమాను దీ
వులను స్వతంత్రభారత ప్రభుత్వము నిల్పిన బోసువీరు ని
స్తుల సముదగ్రపౌరుష యశోమయ గాథలు చెప్పశక్యమే ?

ఒకదెస గాంధి యుద్ధము - మఱొక్కెట బోసుకృపాణశక్తి - వే
ఱొకట ప్రపంచయుద్ధము - మహోద్ధృతితో కొనసాగ ఆంగ్లశా
సకులు తలంకి - లావుసెడి - చచ్చిన చావుగ లొంగివచ్చి - మా
మక చిరదాస్యనాటిక సమాప్తముగా తెరదింపినారురా !

అఱువదియేండ్ల యుద్ధమిది; అశ్రుతపూర్వము; విశ్వధాత్రిలో
చెఱపగరాని నావిజయ చిహ్నము; సత్యము - శాంత్యహింసలుగా
గఱపిన క్రొత్తపాఠము; దిగంబరయోగి - మహాత్మగాంధి అ
బ్బురముగ తెల్లరాచఱికముగా హతమార్చిన దివ్యశక్తిరా !

ముగిసినదోయి దాస్యకథ, మొత్తముపైన స్వతంత్రురాలనై
నెగడితి; కాని యేమనుదు? నిర్ధనదోపిడిచేయబడ్డ దా
నిగ నిలుపేదనై కడుపునిండ భుజించుటకైన లేక - ఈ
పగిది తపించుచుంటి; పెరవారల ముష్టికి కొంగుబట్టుచున్.

పోయెడివారు మంచిగనె పోక - కుమారుల చీలదీసి - ఆం
గ్లేయులు నాయఖండతకు కీడొనరించిరి; దుస్స్వభావులై
కోయతనంబుతో కడుపుగోసిరి; నాసిరి పంచిపెట్టి అ
న్యాయము చేసిపోయిరి; సమైక్యపటుత్వము సన్నగిల్లగా.

మునుపటి రూపుమాసె; చెడిపోయె అఖండవిభూతి; స్వర్గజీ
వనములు మాసిపోయెను; ఉపద్రవముల్ తలపున్కులయ్యె; నా
వెనుకటిశోభ తగ్గె; మఱి స్వేచ్ఛలభించియు కష్టజీవనై
వనరుచునుంటి దుర్దశల; భావియదృష్టము లెట్టులున్నవో ?

ఈతుది వాక్యముం బలికి - ఇంక వచింపగలేక - ఆ జగ
న్మాత దురంతతాపమున గ్రుగ్గుచు, పొక్కుచు, వెచ్చనూర్పుగా
శీతసుగంధ గంధవహసేవలచే పరితాపమార్చి ప్రా
భాతకుమారి మేల్కొలుపుపాడె విహంగకల స్వనంబుతో.

# శుభోదయము

తూరుపుసీమలో పసిడిత్రోవలు ద్రొక్కిన వారుణప్రభా
పూరము పొంగిపొర్లెను; తమోమయలోకము మేలుకాంచి స్వే
చ్ఛారుచిరోదయప్రభల స్నాన మొనర్చెను; ఆమనోజ్ఞ శృం
గార మయప్రభాతమును గాంచుచు నే నిటు లంటి తల్లితో.

కురులు విప్పినచోట కోహినూర్వజ్రాల
        కోటీరకాంతులు గురియునమ్మ!
పలుకవచ్చినచోట బహుళాగమానేక
        పరమార్థవాహినుల్ పారునమ్మ!
అడుగుపెట్టినచోట ఐశ్వర్యములు పొంగు
        బంగారు పంటలు పండునమ్మ!
అభయమిచ్చినచోట ఆగర్భశత్రువు
        భాగ్యభోగ్యాలతో బ్రతుకునమ్మ!

మంగళాంగివి నీఖ్యాతి మాయబోదు
భరతజనయిత్రి! ఇదె సుప్రభాతమయ్యె;
పొరలుదుఃఖంబుతో క్రుంగిపోకుమమ్మ!
ఉతుకునెత్తురుగల పుత్రు లూరుకోరు.

ప్రాణ మానధనంబు లర్పణము చేసి
ధీరులై స్వేచ్ఛ సుతులు సాధించినారు;
ఏ మహత్తరశక్తియు నింకమీద
నిన్ను చెనకంగలేదు మాకన్నతల్లి!

సంధియుగ మిది; స్వాతంత్ర్యసవిత దీప్తి
ప్రాకలే దింక సకల భూభాగమందు;
పూర్వదాస్య తమోభావములు నశించి
నీ విశుద్ధ తత్వంబు రాణింపగలదు.

విపుల హింసామయంబైన విశ్వమునకు
శాంతి సందేశ మిచ్చిన జనని వీవు;
అన్ని ఖండాలు నీకు జోహారుచేసి
ముందు ముందు నీపల్లకి మోయగలవు.

ఈ శుభోదయ శోభ లీపృధివినిండి
పూర్వభాగ్యాలు కుప్పలు పోయగలవు;
రత్నగర్భసుమాట సార్థకముగాగ
మరల దీపింపగలవు సమ్మానములను.

కడుపు చుమ్మలు వలదమ్మ ! కలిసిరాక
చీలిపోయిన వారికై చింతయేల ?
కలరు కోటానకోట్లు నీకన్న ప్రజలు
విశ్వమును దిద్దితీర్చు వివేకమతులు.

రామరాజ్యముగా ప్రజారాజ్యమునకు
తల్లివై మహారాజ్ఞివై ఢిల్లికోట
మీద నీత్రివర్ణపతాక మెఱయుచుండ
పాలనము సేయుమమ్మ ! మాభరత సీమ.

అఖిల లోకైక శాంతినాయకుడు గాంధి
భరతరత్నము జవహ్వారుపండితుండు
విశ్వకల్యాణమూర్తులై వెలసినారు;
కలరె ? నీవంటి పుత్రవతులు ధరిత్రి.

నీమహోజ్జ్వలభావి వర్ణింపలేను
విశ్వశాంతికి గురుభిక్ష పెట్టగలవు;
సభ్యపాశ్చాత్యజగతి నీచరణయుగళి
కొలుచు దినములు ముందు రాగలవు తల్లి.

## విశ్వభారతి

జయ జయ జయ జయ ధర్మశ్రీ !
జయ జయ జయ జయ సత్యశ్రీ !
జయ జయ జయ జయ శాంతిశ్రీ !
జయ జయ జయ జయ భరతశ్రీ !

వేదమాతా ! నీకు జేజే
వీరమాతా ! నీకు జేజే
విశ్వజననీ ! నీకు జేజే
విశ్వభారతి జే !

మంగళమ్—ఓం శాంతిః

జనరల్ ప్రింటర్సు, గుంటూరు-2